ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము. సంఖ్య ౧౫.

శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

(సుకుమారచరిత్రము.)

ఇది

## శ్రీనాథమహాకవి విరచితము.



రెండవకూర్పు ౫౦౦.

కాకినాడ

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచే బ్రకటితము.

1930.

వెల రు 0—12—0.

క్షేమో యని తోఁచును. కాని శ్రీనాథకవి యింతమాత్రమే రచించె ననుట సమంజసముగా నున్నది. ఏలన మొదటఁ బ్రతిజ్ఞచేసిన శివరాత్రిమాహాత్మ్యము ముగిసినది. పైని యమప్రమథాదులయుద్ధములు కథకంతగా నుపకరించునవి గావు. కావున మూల మగునీశానసంహితాధ్యాయాంత్యపద్యానురోధమున నీమునుల ప్రశ్నవాక్యమును గూడ గ్రంథమందుఁ జొప్పించె ననుట యుత్తమము.* రెండవది శ్రీనాథుఁ డీ గ్రంథమును ముగింపకమునుపే కాలగతి నొందుటవలన నాలుగాశ్వాసములు మాత్రమే శ్రీనాథరచితము లని చెప్పవలయును. అంతియ కాని యింకను గొంతభాగ మున్న దనియు నది లేఖకునిచే విడువఁబడిన దనియుఁ జెప్పుటంతే సరికాదు, కావున, శివరాత్రిమాహాత్మ్యము సమగ్రముగనే లభించిన దని తలంపనగును. ఇఁక నీగ్రంథ మేకాలమున రచింపఁబడెనో విమర్శింపవలసి యున్నది.

“సత్కవిసార్వభౌముం డగు శ్రీనాథకవివరేణ్య - - - గాంచి “ ఆ. ౧. ప. ౧౩.

గీ. వేడ్కఁ గవిసార్వభౌముని విమలచరిత ,, ఆ.౧.ప. ౩౮.

వ. అనవుడు నమ్మహీసురాగ్రగణ్యుండు కమలనాభామాత్య
పౌత్త్రుండును మారయామాత్యపుత్త్రుండును నగు శ్రీనా

* ఈయుక్తికి ముందు విమర్శింపఁబోవు ప్రమాణము లాధారములు.

థకవివరేణ్యుండు సంతుష్టమానసుండై. ఆ.౧-౩౮

అను వాక్యములవలనను, ఆశ్వాసాంతగద్యములు నాలుగువలనను శ్రీనాథుఁడు కవిసార్వభౌమబిరుద మందిన పిదప హరవిలాసనైషధములకుఁ బిదప భీమఖండమునకు మునుపు దీనిని రచించె నని శ్రీ వీరేశలింగముపంతులుగారి యూహ. ఈగ్రంథమందు దోషము లత్యధికముగా నుండుటచే నియ్యది శ్రీనాథుని బాల్యకవిత యని బ్ర॥ శ్రీ॥ నాగపూఁడి కుప్పుస్వామయ్యగారి తలంపు. వీరిరువురివాదములలో నేది వాస్తవమో పరికింతము-

"సుతుని న్నుపన్య క్తశాంతాత్మునిన్. ఆ. ౧. ప. ౧.

"ఆలిని బుక్కిటందిడి. ఆ. ౧. ప. ౩.

"కృతిపతు లగుకవిముఖ్యుల. ఆ. ౧. ప. ౯.

"వడిప్రాసపడంబబంధమై, ఆ. ౧. ప. ౧౧.

"నుల్లికార్జునకుత్సలంబర్థఁబడసె. ఆ. ౧. ప. ౧౬.

"పుణ్యబుష్షీశ్వరస ప్తతుల్యులం బోలిన. ఆ.౧.ప.౧౯.

"వైభవసస్ఖ్యాతవరహరిశ్చంద్రుండు. ఆ. ౧. ప. ౨౦.

"ఘనుఁడుకోమరగిరీంద్రుండుగలిగియుండు.ఆ.౧.ప.౨౦.

"నేర్పరతఁడు. ఆ. ౧. ప. ౨౨.

"(సకలసద్గుణ)విఖ్యాతసారసాఖ్య మహితవంచాతురీ మంత్రమానసాత్త ఆ. ౧. ప. ౨౪.

"పరమపాతివ్రత్యభావంబు తలఁపంగ గౌరిగాఁబోలునీ కాంత తలఁప ఆ. ౧. ప. ౨౪.

"నల్వీటుచింత." ఆ. ౧. ప. ౫౬.

"కాకోదరగ్రామణికంఠగ్రైవేయు. ఆ. ౧ ప. ౫౮.

ఇట్టివేకాక యింక ననేకదోషములును నప్రౌఢకవితాబంధమును నవతారికాభాగమున నగపడుచుండుటచే నీగ్రంథము శ్రీనాథరచితము కాదనియైనను బాల్యరచితమనియైనను జెప్పనగును: గాన శ్రీవీరేశలింగముపంతులుగారి యూహ సరికాదు. గ్రంథమునందుఁ బలుతావులఁ గవిసార్వభౌమబిరుద ముండుటచేతను దోషము లవతారికా భాగమందె తక్క మఱెచ్చటను లేకుండుటయేకాక కథాభాగము శ్రీనాథుని యితరగ్రంథముల శైలికి సమానమగు ప్రౌఢిచే నలరారుచుండుటచేతను శ్రీకుప్పుస్వామయ్యగారి తలంపుకూడ సరికాదు. ఇఁక మూఁడవపక్ష మొకటి స్ఫురించినది. దానిని జిత్తగింపఁ బ్రార్థించెద.

శ్రీనాథుఁడు నైషధరచనానంతరము ప్రౌఢదేవరాయల యాస్థానపండితుఁడగు గౌడడిండిమభట్టు నోడించి సార్వభౌమబిరుద మందెను. ఆబిరుద మీగ్రంథమునఁ గలదు గదా! హరవిలాసనైషధములందు లేనిపంచారామాప్సరఃకురంగేశ్వరుల నామములు తొలుదొల్త భీమఖండమున నుపయోగింపఁబడినవి. ఆనామము లీగ్రంథమందు నగపడుచున్నవి. కావున శివరాత్రిమాహాత్మ్యము భీమఖండమునకుఁ బిదపనే రచింపఁబడినది. ఇంతేకాక సంస్కృత కాశీఖండముననుండి గుణనిధిచరిత్రములోని వగు-

శ్లో. "యాయజూకకులే జన్మ క్వక్వ మే వ్యసనం మహత్
అహో బలీయా స్వవిధి ర్భావికర్మానుసాధయేత్
భిక్షితుం నాధిగచ్ఛామి నమే పరిచితః క్వచిత్
నచహస్తే ధనం కించి త్క్రమత్ర శరణం భవేత్
సదా హ్యభ్యుదితే భానౌ ప్రసూర్మే మృష్టభోజనమ్
దద్యా దద్యాత్ర కం యాచే యాచే హా జననీ నమే"

అనుశ్లోకములను—

గీ. అక్కటకట దురోదరవ్యసన మెట్లు
యాయజూకవిశిష్టాన్వవాయ మెట్లు
ఎట్లుచేసినఁ జేయుఁగా కేమనంగ
నేర్చువారము విధి దయానిస్స్వహృదయి.

కాశీ. ఆ. ౪. ప. ౧౧౩.

చ. అరుణగభస్తిబింబముదయాద్రిపయింబొడ తేరగిన్నెలోఁ
బెరుఁగును వంటకంబు వడపిందెలునుం గుడువంగఁబెట్టు ని
ర్భరకరుణాధురీణ యగుప్రాణముప్రాణము తల్లియున్న దే
హరహర యెవ్వరింకఁ గడు పారసి పెట్టెద రీప్సితాన్న

ముల్. ఆ. ౪. ప. ౧౧౪.

అనుపద్యములుగా నాంధ్రీకరించెను. ఇందు మొదటిపద్యమును విస్తరించి శివరాత్రిమాహాత్మ్యమున వర్ణించినాఁడు. రెండవదాని నేమాత్రమును మార్పుసేయక యట్లే చేసినాఁడు. (చూ. ఆ. ౩. ప. ౧౫) ఈ మూలశ్లోకములు కాశీఖండమందు నీశానసంహితయందు నొకరీతినే యుం

డునా? ఈశానసంహిత యెందున్నదో యగపడదు. కాశీఖండమే యీశానసంహిత యనినఁ దప్పు కాఁజాలదు. కావున నీగ్రంథము కాశీఖండము గూడ రచించినపిమ్మటనే ౧౪౪౦ ప్రాంతమున రచింపఁబడె నని నానిశ్చయము. అయినచో నవతారికాభాగమందలి యప్రౌఢశైలికి నలాక్షణికప్రయోగములకును గతి యేమందురా? శ్రీనాథుఁడు కాశీఖండమునందుఁ గుబేరపూర్వవృత్తకథనావసరమున శివరాత్రిమాహాత్మ్యమును గుణనిధిచరిత్రరూపమున వర్ణించెను. తనగ్రంథములం దటనట బాణకాదంబరిలోని వాక్యముల నుపయోగించెఁ గాని యీరెంటియందును దనివిసనక కాదంబరిలోని రసవంతము లగుభాగముల విరివిగ గ్రహించి సుకుమారచరిత్రమును గల్పించి శివరాత్రిమాహాత్మ్యమును సమగ్రముగ వర్ణించెను. గ్రంథముపూర్తిచేసి యవతరణిక రచింపకమునుపే కైలాసమున కేగెను. పిదప శ్రీశైలవాసి యగుశాంతయ యెట్లో యాయేకలిఖితప్రతిని సంపాదించి కొంతధనము వెచ్చించియో లేకయో స్వయముగనో లేక తనయాశ్రితుఁడగు నొకయప్రౌఢకవివలననో యుపోద్ఘాతము నుద్భవింపఁజేసి జనకవియుక్తమై నిరాలంబమైన యీకృతికన్యను దన కంటఁగట్టుకొనియె నని యూహించుట సాహసము కానేరదు. గ్రంథారంభమునందలి యిష్టదేవతాస్తుతియుఁ గవిస్తుతియుఁ గృతిపతికృతికర్త నుద్దేశించి పలికిన వాక్యములును గవిప్రతిజ్ఞావాక్యములందలి ప్రథమ

పురుషప్రయోగమును వేయేల సకలవిధదోషాకరంబైన యవతారికయెల్లను శ్రీనాథుని యితరసర్వగ్రంథములకు భిన్నమార్గముగలదై పైసిద్ధాంతమును బోషించుచున్నది. కావున నిందలి యవతారిక శ్రీనాథవిరచితము కాదనియుఁ గథాభాగము నాలుగాశ్వాసములు మాత్రము కాశీఖండానంతరము ౧౪౪౦ ప్రాంతమున శ్రీనాథునిచరమదశయందు రచింపఁబడెననియు నీగ్రంథమందలి కథానాయకునితోడనే శ్రీనాథుఁడును బ్రమథపదవి నందెననియు నీకృతియే శ్రీనాథునియంత్యకృతి యనియు (దీనికంటె నర్వాచీనకృతి కనఁబడువఱకు) నూహింపవచ్చును.

ఇఁక నీగ్రంథరచనమందలి కొన్ని విశేషములు:—

గీ. వానిఁ గలలోనఁ గానని వనజముఖియు
వాని మాఱ్పనఁ బేరోర్వని మానవతియు
వానిగా నాత్మ భావించి వరుని గవయ
నప్పళింపనిసతియు లేదయ్యె నచట.

శృం. నై. అ. ౧. ౬౦.

అనుపద్యమును విస్తరముగా రసవత్తరముగా శివరాత్రి మాహాత్మ్యమున—

సీ. హృదయ ముప్పొళ్లార నేకాంతముననుండి
వానిఁ జింతింపని వనజముఖియు
నొకమాఱతనిఁజూచి యొండొక్కమఱిఁ జూడ
నభిలషింపనివిద్రుమాధరియును

గలలోన వానిఁ జిక్కఁగఁ గౌఁగిటనుజేర్చి
ముకుళితేక్షణగాని ముద్దియయును
నతనిరూపంబు గుడ్యంబులందు లిఖించి
యందంబుఁ జూడనియంగనయును
జెలులచేతను బ్రోదిరాచిలుకచేత
వానిగుణములు విని కుచద్వంద్వసీమఁ
బాదుకోఁబులకింపని పైదలియును
బన్నిదము వ్రేసినను లేదు పట్టణమున. ఆ. ౨. ౯౪.

అను సీసపద్యముగా రచించెను. ఇంక నిట్టి వనేకము లాతని పూర్వగ్రంథానుకరణము లిందుఁ గలవు.

గ. తస్య రాజ్ఞో నిఖిలకలాకలాపావగాహనగభీరబుద్ధిః - - బృహస్పతి రివ సునాసీరస్య కవి రివ వృషపర్వణః వసిష్ఠ ఇవ దశరథస్య విశ్వామిత్ర ఇవ రామస్య ధౌమ్య ఇ వాజాతశత్రోః దమనక ఇవ భీమస్య సుమతి రివ నలస్య సర్వకార్యేష్వప్రతిహతమతి రమాత్యో బ్రాహ్మణః శుకనాసో నామాభవత్. కాదంబరీ గ. ౨౪౩

వ. ఆరాజునకు నిఖిలశాస్త్రకలాపావగాహనగంభీరబుద్ధి యజ్ఞదత్తుం డనుబ్రాహ్మణుండు దేవేంద్రునకు బృహస్పతియు, వృషపర్వునకు శుక్రుండును, దశరథునకు వసిష్ఠుండును, రామునకు విశ్వామిత్రుండును, నజాతశత్రునకు ధౌమ్యుండును నలునకు దమనుండునుం బోలెఁ బ్రధానిమై" - శివరాత్రి ఆ. ౨. ప. ౧౫.

గ. సత్యపి రూపవిలాసోపహాసితరతివిభ్రమే లావణ్యవతి వినయవ త్యన్వయవతి హృదయహారిణి చావరోధ జనే" కాదంబరీ. గ. ౧౨.

వ. అమ్మంత్రిభార్య వినయవతి వివేకవతి విభ్రమవతి విలాసవతి సౌభాగ్యవతి లక్షణవతి యౌదార్యవతి గాంభీర్యవతి యన" - శివరాత్రి. ఆ. ౨. ప. ౧౫.

పై గద్యమునందలి సప్తమ్యంతములను జఘుత్కారముగఁ బ్రథమాంతములుగ మార్చినాఁడు. మూలమందలి రాజాంతఃపురము నాంధ్రీకరణమున మంత్రిభార్యగా నొనర్చెను.

గ. ఏకం తు తనయముఖకమలదర్శనసుఖం తు పలేభే తథా సంభుజ్యమాన మపి నిష్ఫలపుష్పదర్శనం శరవణ మివాంతఃపుర మభవత్. కాదంబరీ. ౨౭౧-౨౭౨.

గీ. తనయసంతానలబ్ధి దొదవ్వ గాఁగ
విభవసంపత్తి గల్గియు విన్నవోయి
వనితనిష్ఫలపుష్పదర్శనముఁ దాల్చె
శరలతాకాననమువోలె జవ్వనంబు. శివ. ఆ.౨-౧౭

గ. అథ తస్యా స్తాంబూలకరంకవాహినీ సతతప్రత్యాసన్నా మకరికానామ రాజాన మువాచ॥ కా. ౨౬౩.

గ. ప్రథమ మపి స్వామినీ దానవశ్రీరివ సతతనిందితస్ఫురతాశయనాసనస్నానభోజనభూషణపరిగ్రహాదిషు సముచితేషు దివసవ్యాపారేషు కథంకథ మపి పరిజనప్రయ

త్కాత్ప్రివ ర్తమానా సశోకే వాశీత్ - కా. గ. ౨౯౬

గ. దేవ హృదయపీడాపరిజిహీర్షయాచ న దర్శితవతీ సా వికారమ్. కా. గ. ౨౯౭

గ. అద్యతు చతుర్దశీతి భగవంతం మహాకాల మర్చితు మితో గతయా తత్ర మహాభారతే వాచ్యమానే శ్రుతం అపుత్రాణాం కిల గతి ర్నాస్తి నవా సంతి లోకాః. కా. గ. ౨౯౮.

వ. ఈదుఃఖంబునకుఁ గారణం బే మని యడుగుట యుం బ్రత్యుత్తరం బీక యూరకున్న దాని తాంబూలకరంక వాహిని యిట్లను- అను ౨. ఆ. ౩౦. వచనముగా.

గ. అపరేతు - - - - ప్రతారణకుశలై ధూర్తై రమానుషోచితాభి స్తుతిభిః. ప్రతార్యమాణా విత్తమదమత్తచిత్తా నిశ్చేతనతయా తథేత్యాత్మన్యారోపితా లీకాభిమానా- - - - అంతఃప్రవిష్టాగభుజద్వయమివాత్మ బాహు యుగళం సంభావయంతి. గ. ౭౦౪-౦౬.

గ. దర్శనప్రదానమ ప్యనుగ్రహం గణయన్తి. ౭౦౮.

గ. దృష్టిపాతమ ప్యుపకారపక్షే స్థాపయన్తి. ౭౦౯.

గ. సంభాషణ మపి సంవిభాగమధ్యే కుర్వన్తి. ౭౧౦.

గ. ఆజ్ఞా మపి వరప్రదానం మన్యన్తే. ౭౧౧.

గీ. తమ్మమానుషకాలోచితంబు లైన
కీర్తనంబుల మైవులకించుకొండ్రు
తా రమర్త్యులుగా మదిఁ దలఁతు రహహ

విత్తమదమత్తచిత్తులై వెఱ్ఱిజనులు. శివ. ౨-౯౮.

సీ. అయ్యనీవుచతుర్భుజావతారుఁడ వన్న - - - - ౯౭

గ. మిథ్యామాహాత్మ్యగర్వనిర్భరాశ్చనప్రణమంతి దేవతాభ్యః కించ న పూజయన్తి ద్విజాతీన్ న మానయన్తి మాన్యాన్ నార్చయంత్యర్చనీయా న్నాభివాదయంత్యభివాదనార్హాన్ నా భ్యుత్తిష్ఠంతి గురూన్.

గ. ౯౨౨, ౨౩, ౨౪.

ఉ. సంపదపేరికట్టెఁడిపిశాచముసోఁకినమానవుండు పూజింపఁ డభీష్టదేవత భజింపఁడు సజ్జనులైనవారి మన్నింపఁడుమిత్రబంధులగణింపఁడుధర్మరహస్యముల్విచారింపఁడు మీ...ధరింపఁడహంకరణంబుపెంపునన్.

శివ. ఆ.౨-౯౮

గ. ప్రపశ్యచ తరుషండస్య మధ్యభాగే మణిదర్పణ మివ త్రైలోక్యలక్ష్మ్యాః స్ఫటికభూమిగృహ మివ వసుంధరాదేవ్యాః కైలాసమివ ద్రవతా మాపన్నం...చంద్రాతపమివ రసతా ముపేతం హరాట్టహాస మివ జలీభూతమ్...శరదభ్రబృందమివ ద్రవీభూయైకత్రనిష్యందితమ్ అచ్ఛోదం నామసరో దృష్టవాన్. గ. ౮౫౬

సీ. "స్ఫటికరత్నగృహంబు సర్వంసహాకాంత

కభిధాంతరంబు దుగ్ధాంబునిధికి-శివ.౩-౨౧

ఇట్టి యుదాహరణముల సింక ననేకములుగాఁ జూడనగును. వేయేల "తమ్మమానుష" "అయ్య నీవు"

"సంపద పేరి" అనుపద్యముల కీగ్రంథమునం దేప్రసక్తియు లేకున్నను గాదంబరీరసాస్వాదపరవశత్వముననే యాంధ్రీకరించె నన్నచో శ్రీనాథకవి కాదంబరి నాంధ్రీకరించుతలంపుననే శివరాత్రిమాహాత్మ్యరచన మారంభించె ననియును, కాశీఖండమునందలి గుణనిధిదుర్గుణవర్ణనమునను శివరాత్రివ్రతప్రభావవర్ణనమునను దనివిసనక సుకుమారచరిత్రమును గల్పించె ననియును విశద మగును గదా?

పైనిజెప్పిన విశేషములం బట్టి యీగ్రంథ ముత్తమ ప్రబంధములలో నొకటియుఁ బవిత్రగ్రంథములలో నొకటియు ననియుఁ దెలియనగును. ఈగ్రంథ మింతకాలము తాళపత్రములలో ఘుణాక్షరబహుళముగ నింతదనుక (౪౦౦ సంవత్సరములు) ఏరికి నగపడకున్నను నేఁటి కాంధ్ర సాహిత్యపరిషత్తువారి యమోఘపరిశ్రమమువలన నాంధ్రలోకమునకుఁ బ్రత్యక్ష మగుట మహాదృష్టవిశేష మే. ఈ గ్రంథమును దొలుసారిపత్రికలోఁ బ్రకటించుసమయమునఁ, గీర్తిశేషు లగు శ్రీతంజనగరం దేవరాజసుధిగారు చాలసాయ మొనరించిరి. దీనిని సంస్కరించుటయందుఁ గాదంబరియును శ్రీనాథుని యితరగ్రంథము లన్నియును సహాయము లైనవి. అయిన నింకను గ్రంథపాతములును దోషములు సందేహములు ననేకము లుండిపోయినవి.

ఇట్లే యింక నితరుల కనేకసంస్కరణములు దోఁప వచ్చును. అవియెల్లఁ ద్వితీయముద్రణమున గ్రహింపఁ బడును.

ఇట్లు, బుధవిధేయుఁడు,
కట్టి సాంబమూర్తిశాస్త్రి.

---

# ద్వితీయముద్రణపీఠిక.

శ్రీశివరాత్రిమాహాత్మ్యమున కింతత్వరలోనే పునర్ముద్రణయోగము లభించుట కాంధ్రమహాజనులకు శ్రీనాథమహాకవియెడఁ గలభక్త్యాదరములే కారణము. తొలుతటి ముద్రణమై యిప్పటి కించుమించు పండ్రెండేండ్లు గతించినవి. తొలుతటిపీఠికకంటె నీపీఠికయం దనేకాధికాంశములు చేర్పఁగల నని విశ్వసించిన నాకుఁ బ్రత్యంతరాలాభము నిరుత్సాహజనకమైనది. అయిన నీగ్రంథము ప్రకటింపఁబడినపిదప ననేకులు పత్రికాముఖమ్మునఁ జర్చించినవిషయములవలనఁ గొన్ని నూత్నాంశములు తెలియవచ్చినవి. వాని నుచితరీతిని వివరింతును.

ఈనడుమ రాజకీయప్రాచ్యలిఖితపుస్తకాలయాధికారులకు "ఈశానసంహిత" యను గ్రంథ మొకటి లభించి

నది. దానియం దీకథకు మూల మున్నది. దానిపరిమా ణము నూఱుశ్లోకములు మాత్రమే. ఆనూఱుశ్లోకములనే యాతఁడుతగాఁ గొని కాదంబరీవర్ణములను జేర్చి మనకవి యింత గ్రంథముగా రచించినాఁడు. ఆమూలమును బట్టి చూడ నిం కొక్కయాశ్వాసము గ్రంథ ముండవలయు నని తెలియుచున్నది, గాని, యది యాతఁ డాంధ్రీకరించెనో లేదో నిర్ణయించుట కాధారము లంతగా నగపడకున్నవి.

తొలుతటిపీఠికలో నీ గ్రంథము చిరకాలమువఱ కెవ్వరు నెఱుఁగ రని వ్రాసియుంటిని. దాని నీక్రిందిరీతిని సవరించుకొన వేఁడెదను.

ఉ. కాయజవిక్రియం బడయఁగానికులంబున సంభవించి యు,న్యాయము సేయు నేయిటుదురాత్ముఁడు వీఁడు త్రపాభిమానము, లాయగఁదట్టియంచు నతిమాత్రములజ్జితుఁడైనకైవడిం, దోయజషండ బాంధవుఁ డధోముఖుఁ డయ్యెనభోంగణమ్మునన్.

శా. ప్రాలెం బశ్చిమశైలశృంగముపయిం బ్రత్యగ్రమాణిక్యగమో, న్నీల త్రింశుకకోరక స్తబక కాంతిన్ భానుమణ్డలం, బాలంబించె మరుండు హస్తమున దాక్షారామ లీలావతీ, భ్రూరేఖానిభవిభ్రమాభ్యుదయముంబుం ద్రెంచు కోదండమున్.

క. క్రుంకె విభాకరబింబము
పంకజషండములు మొగిడెఁ బ్రత్యగ్వీథిం

౧౦ కేలీతరుపల్లవ
సంకాశచ్ఛాయఁ గొమరుసంజ జనించెన్.

వీనికిఁ బ్రతిబింబములు మనుచరిత్రమునఁ గలవు:—

చ. తరుణి ననన్యకాంత నతిదారుణ పుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవు బారికి నగ్గము చేసి క్రూరుఁడై
యరిగెమహీసురాధముఁ డహంకృతితోననిరోషభీషణ
స్ఫురణవహించెనోయననభోమణిదాల్చెఁగషాయదీధితిన్

శా. శ్రేణుల్గట్టి నభోంతరాళమునఁ బాఱెంబక్షుం ష్ణాంశు
పా, షాణవ్రాతముకోష్ణమయ్యె మృగతృష్ణావార్ధులిం
కెంజపా, శోణంబయ్యెఁ బతంగబింబముదిశాస్తోమంబు
శోభాదరి, ద్రాణం బయ్యెఁ సరోజషండములు నిద్రా
ణంబు లయ్యెంగడున్.

పెద్దనార్యుఁడు శివరాత్రి మాహాత్మ్యమును బాగుగా నెఱుఁగు ననుటకుఁ బైపద్యములు తార్కాణము.

ఆంధ్రీకరణమునందలి విశేషములు తొలిపీఠికలోఁ జాలవఱకుఁ జూపితిని, గావున, స్వల్పలోపములను మాత్ర మిటఁ జూపెదను:—

వ. "ఆరాజునకు...నలునకుదమనకుండునుంబోలె" ఆ-౨-౧౫
నలునిమంత్రి సుమతి యై యుండ దమనకుఁ డనుట ప్రమాదము.

వ. సర్వజగత్ప్రసిద్ధంబు గదా...దశరథుండు దిగ్గజములం
బోలినకుమారుల—ఆ-౨-౩౫.

దిగ్గజము లెనిమిది యైయుండ నాలుగనుట యప్రసిద్ధము.
ఆ ౨.౩౩ పద్యము పూర్వోత్తరార్థములకు సంబంధము లేదు.

"బహుదినంబు లమ్మహాసచివు పట్టపుదేవికి" ఆ౨-౨౦.
చివునిభార్యను బట్టపుదేవియనుట సమంజసము కాదు.

శా. "సీమంతోన్నతసంభ్రమంబు వెలయం జేయించె శ్రీ యజ్ఞదత్తామాత్యాగ్రణికన్నృపాలకుండు" ఆ౨-౫౨
యజ్ఞదత్తునిభార్యకుం జేయవలసిన సీమంతోన్నయనసంస్కారము నాతనికే రాజు చేయించుటయు నసమంజసము.

క. "పరిషత్కాంతరమునం దా సరసిరుహాకరము వెడలి" అనంతరము కాని యంతరమైయుండదు. ఆ ౩-౨౩

కాదంబరీభాగముల నందందు బహుళముగం జొప్పించినట్లు పూర్వపీఠికలోం జేర్కొని యుంటిని. ఇంకను క్రిందివిషయములనుగూడ దిలకింపుడు.

కాదంబరిలోని శూద్రకుండును దారాపీడుండును జేరి యిందు హేమాంగదరూపము నొందిరి. తారాపీడుని పట్టమహిషి విలాసవతియు శూద్రకుని యంతఃపురమును నిందు యజ్ఞదత్తామాత్యునిభార్య సుశీలగాం బరిణమించిరి. కాదంబరిలోని శుకనాసుం డిందు యజ్ఞదత్తుండయ్యెను. అందలి చంద్రాపీడవైశంపాయను లిందు విద్యాభ్యాసకా

లమున సుకుమారత్వ మొందిరి. కాదంబరిలో శుకమును దీసికొనివచ్చిన చండాలదారికారూపచ్ఛన్న యగుమహాలక్ష్మి యిందుఁ గథానాయికయగు జనంగమకన్యగా నవతరించినది. అందలిపక్కణము యిందలి పక్కణము. అందలిశబరసేనాపతి మాతంగకుఁ డిందు మాలెతతోఁ గాఁపురమున్న సుకుమారభూమికఁ దాల్చెను. అందలిశబరసైనికు లిందు వృద్ధసుకుమారునిసహచరులు. కాదంబరిలోని తారాపీడుని మహిషి విలాసవతి సంతతి లేక విచారించుట, భర్త యామె నోదార్చుట, తాంబూలకరంకవాహిని గుట్టు చెప్పుట, శివాలయపురాణశ్రుతి, దానధర్మాదు లాచరించుట, గర్భప్రాప్తి, సూతికాగృహాలంకారము, ప్రసవము, ప్రసూతిసమయబలివిధానము, కుమారసంరక్షణము, శైశవక్రీడలు మొదలగున వెల్ల దీనియం దట్లే సలక్షణముగ యజ్ఞదత్తునిభార్య విలాసవతి వానికుమారుఁడు సుకుమారుఁడు వీరివిషయమున వర్ణింపఁబడినవి. సీమంతోన్నయనపుంసవనము లిందు స్వతంత్రముగఁ జేర్పఁబడినవి. అధమాధమవాపక్షమున నొక్కపర్యాయమే జరుపఁబడిన యారెండుకర్మలు నానాఁటికే యాంధ్రదేశమునఁ గరశ్రద్ధ యడుగంటె నని తెలుపుచున్నవి.

ఈ యంశముల నెల్ల నాలోచించిన నీకవి నూతనము నెట్లు పెంచినాఁడో తెలియఁ గలదు.

దీనికి మూల మగునీశానసంహితాభాగమును నేనిం కను జూడఁ దటస్థింపలేదు. అది లభించెనేని త్వరలో నేయీ గ్రంథమున కనుబంధముగ నందలివిషయములను గూడఁ బ్రకటింతును.

బుధజనవిధేయుఁడు,

విద్వాన్, కట్టి సాంబమూర్తిశాస్త్రి.

శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

## (సుకుమారచరిత్రము)

### ప్రథమాశ్వాసము.

-----

#### ఇష్టదేవతాప్రార్థనాదికము.

శా. శ్రీ - - - వాశిత్రోరస్థలీ
నాగాధీశవిశిష్టసంస్తపలసన్నాళీక పాదద్వయ
ప్రాగల్భ్యం డగుశంకరుండు మనుచుం బ్రత్యక్షమైయె
ప్పుడున్। యోగీంద్రాఖ్యుని ముమ్మడీంద్రసుతుని న్నాద్యు
క్తశాంతాత్మునిన్. . .

శా. శ్రీరామారమణుండ శేషజగతీక్షేమంకర ప్రక్రియా,
భారాయత్తమనస్కుఁ డార్యజనసంభావ్యుండుభవ్యాత్ముఁ
డై, గారామారఁగ నుమ్మమాంబికసుతున్ గౌరీశభక్తాగ్రణిన్, ధీరున్మమ్మయశాంతుని న్మనుచుసం దీర్ఘాయురర్థాఢ్యుఁ గన్.

ఉ. నాలుగు మోములందనరనాలుగు వేదములభ్యసించుచున్
నాలుగునైదురూపముల నవ్యసుఖ . . . చేసియుగ్,ఆలిని

బుక్కిటందిడి విహాయసవీథిని నంచ నెక్కి తాఁ,జాలఁ
జరించుబ్రహ్మఘనశాంతుఁడుశాంతనఁ బ్రోచుఁగావుతన్.

చ. హరిహరపద్మజాదులగునాద్యులుసంతతభక్తియుక్తులై
చిర మగునిష్టసంపదలఁ జేకొని లోకములన్ సృజింపఁగా
నరుదుగఁ బ్రేమఁ బ్రోవలయమందఁగఁ జేయఁగఁ గర్తలైరినీ
పరమహనీయతత్త్వ మనివార్యము సద్గుణశీల పార్వతీ.

గీ. మదనుఁ గన్నతల్లి మాధవునిల్లాలు
బ్రతుకు లెల్లఁ దానె పట్టిచూడ
ముఖ్యమైనలక్ష్మి ముమ్మయశాంతాత్మ
మందిరంబునందు మసలుచుండు. ౫

ఉ. కవికవితాబ్ధిలోనముఖగహ్వరమోడయుజిహ్వత్రేడహ్వ
త్పవనుఁడు పీలికాఁడు మృదుభాషలు రత్నము......
......మాత్మవర్తకునికై పడి నీకు విశేషసత్కృతుల్
గవయఁగనిచ్చునీవలనఁగా వ్యసుఖస్థితియిచ్చుఁగావుతన్.

సీ. బాణు నద్భుతశాస్త్రబహుకలాపారీణుఁ
బ్రకటవరకవితా - - -
- - - - గాంభీర్యబంధానుబంధవి
స్ఫురితమహోన్నతిస్తోము సోముఁ
జిరతరమతిభద్రుఁ జెన్నారిశివభద్రు
చతులగుణాస్ఫారు నమ్మయూరు
వరనీతిచాతురీవాగ్భూతిశ్రీవభూతి
... మోఘుమాఘు

ఘనవినూత్నవికాసు శ్రీకాళిదాసు
దండి కావ్యానులాపవాగ్దండి దండిఁ
జిత్రవాగ్జృంభణప్రఖ్యుఁ జిత్రపాఖ్యుఁ
దగిలి మలహణు బిలహణు - - ౭

ఉ. ఉన్నతమైన యాంధ్రకవితోక్తుల నెంతయుఁ బ్రోడలైన యా
నన్నయభట్టు తిక్కకవినాయకుఁ డెఱ్ఱన శంభుదాసు -
. ... - . .
- -శాస్త్రముల సంఘట - -కన్. ౮

క. కృతిపతు లగుకవిముఖ్యుల
సతతముఁ గొనియాడి వారిసన్నుతి - -
- - - -
- - - - ౯

క. - -కోటుల
తెలుఁగదె యని తప్పు తెల్లఁ దీర్తురు వశులై
యెలుఁగరు సుకవులఁ గుకవులు
కలకులు వలుకుటయు నేర్పు గర్వప్రౌఢిన్. ౧౦

ఉ. పద్యగణాక్షరప్రకరభావరసార్థగుణా... శబ్దపదహేతు
కలారసనక్రియాఢ్యమై, యాద్యులు చన్నమార్గమున
నావడిప్రాసవిడంబబంధమై, చోద్యముగాఁగఁ జెప్పు
కృతి శ్రోత్రసుఖావహ మెల్లచోటులన్.

శా. ... ... సంభూతకస్థానమై, ఖ్యా
తంబై బుధహృద్యమంగళకవీంద్రాచార్యసంసేవ్యమై,

యాతార్ధసుధాంశువైకమలజాతాకల్పమై యొప్పు
డున్, జ్యోతిశ్చక్రముఁ బోలెఁ గ్రాలవలదా సాం...౧౨

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును గురుప్రశంసయుఁ గవీ
శ్వరప్రస్తుతియుఁ గుకవి నిరాకరణంబునుం జేసి యొక్క
కవితావిధానంబు శైవంబుగా సుకుమారచరిత్రంబు--
శిష్యస్త్రీ శ్రీపర్వతస్వయంభూశ్రీ త్రిపురాంతక చక్రవర్తి శ్రీమన్మల్లి
కార్జున శ్రీమహాదేవుని ముఖమండపంబున సుఖాసీను
లయి యందు గండపృథ్వీమహా..భక్తప్రకరంబులును
విజయనధ్యక్షు లగు శుద్ధక్షత్రియులును, ధనపతిసమా
నసంపద్భాసితు లగు వైశ్యులును, సిగ్వక్రపరాక్రము
లగు వీరభటులును, శంకరపురాధ్యక్షులును, స్థానా--
యోగంబును, గుండలి దండలాసక ప్రేరణి ప్రేంఖణం
బులైన చతుర్విధనృత్తగీత వాద్యాభిజ్ఞులును, గళావిలా
సకరుణాబంధురబంధభేదంబుల గంధర్వసంగరప్రవీణు
లయిన ... సియుండ శ్రీశాంతభిక్షావృత్తియతీశ్వ
రుండు శివకథావిధానంబులఁ బ్రొద్దులు పుచ్చుచుఁ దన
మూలభృత్యుం డగు పప్పులఘుముమ్మడి దేవయ్యశాంతు
నిం గనుంగొని నీపేరన...కవిత్వంబున నీకథ యుపన్య
సింపుమన మహాప్రసాదం బని సత్త్వవిసార్వభౌముం డగు
శ్రీనాథకవివరేణ్యుని కృపావిశేషంబునం గాంచి శ్రీమన్మ
ల్లికార్జునమహాదేవ ... అంగముగండముఖ్యవరణా...
లోష్ఠయేకోరామేశ్వరపండితారాధ్యాదిచాతుర్వర్ణ్యం

బులుం గలిగిన మ . యందు...బందిన మల్లినాథ
గురుండు - - - - ౧౩

సీ. (లింగార్చ)న క్రియాలీల నేప్రొద్దును
గరికాలచోడని కరణివాఁడు
జంగమారాధనసక్తుఁ డైన
- - - -
- - - - -
- - య్యసరణివాఁడు
వరధర్మచాతురీ వైభవఖ్యాతిచే
సేనమరాయని చెలువువాఁడు
ననఁగ నిద్ధాత్రి నింపారు సఖలకళల
సకలనిర్వాణవిద్యాప్రశస్తుఁ డనఁగ
మానితైశ్వర్యసంప్రాప్త - - -
మల్లికార్జునయోగిసమాజపరుఁడు. ౧౪

క. ఆతనివంశంబునఁ బ్ర
ఖ్యాతిగఁ జరితప్రతాపకలనాధర్మం
డాతతవిక్రమశీలుఁడు
భూతలమునఁ గొమ్మవిభుఁడు పొలుపై వెలసెన్.॥ ౧౫

సీ. చేపూరిభీమేశుఁ జెలువార గుండెలఁ
బూజ గావించినపుణ్యమూర్తి
కడిమిమై నిరువత్తుగండనిచే మల్లి
కార్జునకుత్పలం బర్థిఁ బడసెఁ

గొలని రామారెడ్డి వలన లింగాల
- - - - రిమెతోడ
భక్తిరాజాఖ్యచేఁ బర్వతేశ్వరునకు
నర్పించెఁ జెరువాడు నాతుకూరు
ధరణిఁ ద్రిపురాంతకున కాముదాలపల్లె
రాయవేశ్యాభుజంగువల్లావ యిచ్చె
నిట్టి పౌరుష - - - -
బోలిదేవయ్య చెన్నారుఁ బుణ్యమూర్తి. ౧౭
ఆగురుస్వామి నిజవంశానుచారంబునకుం దగిన తలోదరిం బరిణయంబయ్యె నంత. ౧౮
గారితలోదరి గాఁబోలు నీభా
- - యుండు
శ్రీలక్ష్మి గాఁబోలుఁ జెలువసౌభాగ్యంబు
దిక్కుల నెల్లను బిక్కటిల్లు
వాగ్దేవి గాఁబోలు వర్ణితబహుశాస్త్ర
పాండిత్యవిస్ఫూర్తిఁ బరిఢవించు
నింద్రాణి గాఁబోలు నిందునిభాస్య...
..ఖ్యాతిచేఁ బరఁగుచుండు
ననఁగ నేప్రొద్దు గుణముల నతిశయిల్లి
పరఁగ శ్రీశైలనాథునిపట్టనమునఁ
బోలిదేవయ్య కులసతి పుణ్యచరిత
ముదితసజ్జననికురుంబ ముమ్మమాంబ. ౧౯

ఉ. పోలయమమ్మమాంబికలు పుణ్యచరిత్రుల భక్తియుక్తులం
బోలఁగఁ,గాంచి రేద్వీరను బుణ్యఋషీశ్వరసప్తతుల్యులం
బోలినపుత్రసప్తకము భూతహితార్థగుణప్రవృత్తికై
లాలితవిక్రమోన్నతుల లక్షణదివ్యవిచక్షణాత్ములన్. ౧౯

సీ. రామామనోహరరతి రాజనిభుఁడు శ్రీ
మల్లినాథాఖ్యుండు మహిమ వెలయ
- - చారనిర్మలస్వాంతుండు
శ్రీగిరినాథయ్య చెలువు మీఱుఁ
బరమశైవాచారపాండిత్యగరిమల
సెట్టిదేవాఖ్యుఁడు చెన్ను మీఱు
వైభవప్రఖ్యాతవరహరిశ్చంద్రుండు
భీమేశ్వరస్వా - - -
వెలయ ముమ్మడిదేవయ్య వినుతకీర్తి
ఘనుఁడు కొమరగిరీంద్రుండు గలిగియుండు
- - పోతలింగాఖ్యుఁడు పొలుపు మీఱు
సప్తఋషులకు నేప్రొద్దుసములు- ౨౦

క. - - -
- - - గావలసెను
కారణజన్ముండు...పూరకి -
- - - - ౨౧

సీ. లింగార్చనక్రియా...చెల్లించు
విఖ్యాతి...య్యదండా... వాఁడు

\- - - -

\- - - -

పరమలింగధ్యానపారీణసద్బుద్ధి
నల్లమప్రభులీల నలరువాఁడు
రుచ్యర్పణక్రియారూఢి నిద్ధారణి
మాదరచెన్నయ్య (మహిమవాఁడు)
చెలఁగె గురులింగజంగమసేవకుండు
మల్లికార్జునశివునకు మంత్రియనఁగ
దూర్పునాఁడెల్లఁ బాలించునేర్పరతఁడు
శ్రీసమేతుండు పోలయసెట్టివిభుఁడు. ౨౨

వ. అమ్మహాత్ముండు దనవర్ణనంబునకుం దగినవర్ణనీయ యగు
సాధ్వి వివాహంబయ్యె నంత. ౨౪

సీ. పార్వతిమూర్తియు భారతీదేవియు
నిందిరరూపంబు నింద్రుసతియు
రోహిణీదేవియు రుక్మిణీదేవియు
స్వాహాస్వధాత్ములశక్తిచయము
గంధర్వసతులును గందర్పుభామయుఁ
(గశ్యపు)సాధ్వులుఁ గ్రతువుసతులు
వరవసిష్ఠునిరాణి ధరఁ గుంభసంభవు
రామయు నాదిత్యరమణిఁ గూడి
ధరణి నొక్కటఁ బుట్టించెధాత యనఁగ
మగువ సెట్టిదేవాఖ్యనిమారమాంబ

(సకలసద్గుణవి)ఖ్యాతసారసాఖ్య
మహితపంచాక్షరీమంత్రమానసాత్మ. ౨౪

క. సెట్టియమారమ గాంచెను
దట్టుల భీమయ్యఁ బ్రోలధరణీధవునిన్
మట్టురగండని మమ్మయ
సెట్టన విలసిల్లువీరశేఖరు నర్థిన్. ౨౫

క. పారావారగభీరుఁడు
నారీజనమన్మథుండు నరనుతుఁ డనఁగా
ధారణి సెట్టియభీముఁడు
వారక వర్ధిల్లు నెపుడు వైభవ మలరన్. ౨౬

క. లాలితవైభవశీలుఁడు
లోలాక్షీమన్మథుండు లోకఖ్యాతుం
డాలోలచరిత్రుఁడు ధరఁ
బ్రోలామాత్యుండు వెలసెఁ బుణ్యోదయుఁడై. ౨౭

సీ. పంచాక్షరీమంత్రపారిజాతోద్భూత
ఫలము లేగురుపుసంభాషణములు
వీరశైవాచారవిమలమార్గానూన
శాశ్వతం బేగురుస్వామిమహిమ
నిఖిలదేశాధీశనివహప్రమేయక
పాత్ర మేగురుమూర్తిపాదయుగళి
శంకరపూజాప్రశస్తదీక్షాజనా
(హ్లాద మేగు)రువుహస్తాంబుజాత

మనఁగఁ బండితచెనమల్లికార్జునునకుఁ
(పౌత్ర)రత్నంబు పెట్టియప్రభుసుతుండు
మారమాంబాతనూజుఁడు మహితయశుఁడు
వెలయు ముమ్మడిదేవయ్య వినుతకీర్తి. ౨౮

ఉ. శ్రీగిరి(తూర్పుభాగ)మునఁ జెన్నగుభక్తిమహత్త్వ...
- -గమవేదశాస్త్రముల నంచితధర్మకథాప్రసంగవి...
- -విశేషసూత్రముల నాయతశక్తి సుభక్తియు -
... ... చెప్పెదు నెప్పుడున్. ... ౨౯

క. వార - - -
సారార్థము లయినకృతుల సభలోపలఁ బా
గారామారఁగఁ బలికిన
శారద యీరూపనంగ జగతిఁ (జరించున్). 30

సీ. - - -లాఖ్యమాన
భీకరుండు - -
(బసవశ)ంకరుండు పరవాదిమండూక
భయదపన్నగుండు భక్తిఘనుఁడు. 3౧

క. పీతాంబరుఁ బొలియించిన
ఖ్యాతచరిత్రుండు జైనకాకోదరతా
ర్క్ష్యాతతబిరుదాంకుఁడు సం
జాతప్రవిలీనబిరుదసమ్మతుఁ డెలమిన్. 3౨

చ. పరిణయు మయ్యెఁ గాంతఁ గులభామిని రుద్రయపుత్రి
శాంకరిన్, సరసకలాభిరామ కులసంస్తుత (పుణ్య)

చరిత్రయు క్తయై, యరయఁగఁబుట్టినట్టి త్రిపురాంబిక
కూఁతురుభాగ్య దేవతం,బరమపతివ్రతానిలయ భాసుర
నిర్మలగాత్రి సద్గుణ. 33

సీ. పరమపాతివ్రత్యభావంబుఁ దలఁపంగ
గౌరి గాఁబోలు నీకాంత తలఁప
సకలసంపత్స్ఫూర్తి చాతుర్యమహిమల
నిందిర గాఁబోలు నిందువదన
సకలవిద్యాప్రౌఢి సడిసన్న గరిమల
భారతి గాఁబోలు భామ యెపుడు
సర్వలక్షణగుణసంపన్నతోన్నతి
నింద్రాణి గాఁబోలు నిగురుఁబోణి
యనఁగ నిద్ధాత్రి నేప్రొద్దు నతిశయిల్లెఁ
బరఁగ ముమ్మడి దేవయ్యభామ జగతిఁ
గామితార్థకసంధానకల్పవల్లి
యుజ్జ్వలద్గుణనికురుంబ యొమ్మమాంబ. 34

ఉ. ముమ్మడి దేవచంద్రునకు ముఖ్యతలోదరి యొమ్మమాంబకు
...మ్మగ వేదశాస్త్ర పరి- - - శుద్ధయుక్తికిన్
ఇమ్మహి నెల్లవారలకు నీప్సితవస్తువిధాయియై ధరన్
సమ్మతినుద్భవిల్లెఁబర శాంతుఁడు శాంతనవాగ్రగణ్యుఁడై.

సీ. పరవాదిమత్తేభపంచాననాఖ్యుండు
పరవాదిమండూకపన్నగుండు
పరవాదినవమేఘపవమానధీరుండు
పరవాదిసాగరబాడబుండు

పరవాదికుతీక్ష్ణభాసురదంభోళి
పరవాదికేంధనపావకుండు
పరవాదిచయతమఃపటలోగ్రభానుండు
పరవాదిభోగిసుపర్ణుఁ డనఁగఁ
జటులదైనకోలాహలసమరబిరుద
ఘనుఁడు సంగ్రామపార్థుండు వినుతియశుఁడు
శుభుఁడు ముమ్మడి దేవయ్యసుతుఁ డనంగ
వెలసె శాంతయ్య విక్రమవీరవరుఁడు. ౩౬

గీ. వేడ్కఁ గవిసార్వభౌముని విమలచరిత
స్కాందపౌరాణికం బైనకథలలోన
ఘనత శివరాత్రి చరితంబుఁ దెనుఁగుగాఁగఁ
గరుణఁ జేయుము శ్రీనాథకవివరేణ్య. ౩౭

వ. అనవుడు నమ్మహీసురాగ్రగణ్యుండు కమలనాభామాత్య
పౌత్రుండును మారయామాత్యపుత్రుండును నగు శ్రీనాథ
కవివరేణ్యుండును సంతుష్టమానసుండై శాంతిస్వామి
యొసంగిన కర్పూరతాంబూలజాంబూనదాభరణంబులు
స్వీకరించి స్కాందంబున నీశానసంహితం జెప్పంబడ్డ
యురులింగోద్భవంబును శివరాత్రిమాహాత్మ్యంబును...
కథావిధానంబున కథీశ్వరుఁగా శాంత - ౩౮

షష్ఠ్యంతములు.

క. - - -
- దానని ర్మలమతికిం

కృత్యాకృత్యవివేకికిఁ
బ్రత్యర్థిద్విరదదళనపంచాస్యునకున్. ౩౯

క. రామామన్మథమూర్తికి
రామత్రయలీలమతికి రమ్యాత్మునకున్
సోమవ్రతవర కాంతికి
భీమజయోత్కటవిశేషభీకరమతికిన్. ౪౦

క. శైవాగమశాస్త్రాది
ప్రావీణ్యాగణ్యపుణ్యభరితాత్మునకున్
భావాభావవివేకికి
భావితవంశావతారపరమాత్మునకున్. ౪౧

క. జంభాంతకవైభవునకు
సంభృతశాస్త్రప్రతాపశైలోన్నతికిన్
శుంభత్ప్రాభవరతికిన్
దంభోళిస్ఫురితతీవ్రతరఖడ్గునకున్. ౪౨

క. వరముమ్మయశాంతునకుఁ
బరమపరజ్ఞాననిధికిఁ బావనమతికిన్
నిరుపమవిక్రమయశునకుఁ
గరుణారసపూరితాత్తకలితాంగునకున్. ౪౩

వ. అభ్యుదయపరంపరాభివృద్ధియునభిమతార్థసిద్ధియుసత్య
ధర్మక్రియావృద్ధియు నగున ట్లష్టాదశవర్ణనాగర్భంబుగా
నత్యాశ్చర్యకరం బై యుండ నా రచియింపం బూనిన
కథానిధానంబు సకలపాపనిర్ముక్తంబై సర్వవస్తుసంధా

నం బై సర్వలక్షణసంపన్నం బై సర్వాగమామానసం భావితసంస్తుత్యంబై పరమధర్మోత్కృష్టంబై పరమేశ్వరప్రియంబై పార్వతీమనోహరంబై శ్రీనాథసేవితంబై బ్రహ్మ రుద్ర దేవతాది సంస్తూయమానం బై శోభిల్లు నిష్పుణ్యచారిత్రంబు దశదోషవివర్జితంబై ... నానేర్చిన విధంబున రచియించెద నది యెట్టిదనినఁ బూర్వోక్త మార్గంబునఁ బరిపూర్ణంబై యథావిధి శోభిల్లు నిష్పుణ్యచారిత్రంబుఁ బోలినట్టి ధర్మక్షేత్రంబును మహాతీర్థంబును నగుగంగాకాలిందీసంగమంబున సంశితాత్ములు సత్యవ్రతపరాయణులు నగుశౌనకాదిమహామునులు దీర్ఘసత్రంబునందుఁ గూడి యుండంగ వేదవ్యాసప్రియశిష్యుండు రోమహర్షణతనయుండు పౌరాణికుండు సూత్యాహిసంభవుండు సూతుం డేతెంచిన సంహృష్టమానసు లయి యమ్మహామును లాసనార్ఘ్యపాద్యాదులం బూజించి యతని కిట్లనిరి. ౪౪

సీ. సర్వజ్ఞ రోమహర్షణతనూభవ సూత
యఖిలపురాణవిద్యాప్రగల్భ
పంచావయవయుక్తభవ్యకావ్యవిదగ్ధ
యాశ్చర్యహేతువు లైనకథలు
రత్నాకరమునందు రత్నంబులునుబోలెఁ
గలవు నీయందుఁ బొగడ్తగాదు
నీవెఱుంగనివిద్య లీవిశ్వమున లేవు
తర్కించి యెన్నివిధములఁ జూడ

నుత్తరోత్తరసత్కృత్య మొప్పనీకుఁ
గాలనిర్ణయకలన నీకరతలంబు
పూర్వమున మేము సేసినపుణ్యమెల్ల
ఫలితముగ నేఁడు దెంచితి†ప్రార్థనంబు. ౪౫

వ. వేదంబులు నాలుగంగంబు లాఱు మీమాంసాన్యాయవిస్తరపురాణధర్మశాస్త్రంబు లాయుర్వేదధనుర్వేదంబు లర్థశాస్త్రంబు లన నష్టాదశవిద్యానిధానంబులకు నాదికర్త సదాశివుం డాశూలపాణి యమ్మహాస్థానంబులు బ్రహ్మకుపదేశించె ననంతరంబు శంకరాజ్ఞాప్రచోదితుండై కృష్ణద్వైపాయనాభిధానంబున ననాదినిధనుండు పుండరీకాక్షుండును, నరణియందు వైశ్వానరుండునుం బోలె ద్వాపరాంతంబున సత్యవతియందావిర్భవించె వేదార్థోపబృంహణార్థంబు సర్గప్రతిసర్గవంశమన్వంతరవంశానుచరితంబు లనుపంచలక్షణంబులం గలిగి బ్రాహ్మంబు వైష్ణవంబు శైవంబు భాగవతంబు భవిష్యంబు నారదీయంబు మార్కండేయం బాగ్నేయంబు పాద్మంబు బ్రహ్మకైవర్తంబు లైంగంబు వారాహంబు స్కాందంబు వామనంబు కౌర్మంబు మాత్స్యంబు గారుడంబు బ్రహ్మాండంబు లను మహాపురాణంబులు పదునెనిమిది గల్పించె నవియును. ౪౬

గీ. గ్రంథసంఖ్యఁ బురాణసంఘంబుగూడి
నాల్గులక్షల నీపురాణములలోన

---

† తప్రార్థనంబ.

నాలుగువేల గ్రంథములలోన నుతివహించి
శ్రీమహాస్కాందసంహిత శివునిఁజెప్పు. ౪౭

వ. అందు శివరాత్రిమాహాత్మ్యంబు చెప్పంబడియుండు నమ్మహావ్రతంబెట్టి దెవ్వ రాచరించి రేఫలంబు నొసంగు మాకుం బరిపాటి తేటపడ వివరింపు మనిన నక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. ౪౮

ఉ. తాపససార్వభౌములు సదాశివరాత్రిమహావ్రతంబుదో
షాపహృతిక్రమంబు వినుఁ డాదరణంబున నేను సద్గురు
శ్రీపదపద్మము ల్దలఁచి చెప్పెద శంకరసంహితాకథా
దీపితభవ్యమార్గమును దేటపడ న్మొదలింటినుండియున్.

గీ. ప్రళయకాలంబుతుదఁ గాళరాత్రి చనిన
నపరమగుసర్గమునకు బీజాంకురంబు
శీతమును నుష్ణమును గాఁగఁ జలువచిలువ
గంధవాహంబువీఁచు నిర్గంధ మగుచు. ౫౦

సీ. మూలముట్టుగను నున్మూలనంబును బొంది
మహీధరంబులురూపుమాలియుండఁ
ద్రిభువనంబులును జల త్తృణరాశియునుఁ బోలె
సప్తార్చిచేత భస్మంబు గాఁగఁ
బుష్కలావర్తకాంభోధరంబులు వృష్టి
విశ్వప్రపంచంబు వెల్లిగొనఁగ

భూర్భువస్స్వర్లోకములు మహర్లోకంబు
జనలోక మెక్కి విశ్రాంతి మెఱయ
సఖిలదిక్కులు ముంచి బ్రహ్మాండగోళ
మప్పళించుచు...సప్తార్ణవములు
నిండిపోనియుండఁగా రిత్తనింగితోడఁ
గొంత కాలంబు శూన్యమై గొడ్డువోయె. ౫౧

వ. అప్పుడు బ్రహ్మ నారాయణుండై శివయోగముద్రా
ముద్రితలోచనుం డగుచు సముద్రంబునడుమం బవ్వ
ళించిన. ౫౨

క. జనలోక మెక్కి సిద్ధులు
వినుతించిరి జలధిసలిలవీచీరింఖ
ద్ఘనజాతయోగనిద్రా
వినిమీలితదీర్ఘనయను విషధరశయనున్. ౫౩

గీ. దేవతలు సంస్తుతింపఁగఁ దెల్లవాఱెఁ
గల్పసంహారకాలంబు కాళరాత్రి
యంతమేల్కని కూర్చుండె నాదిపురుషుఁ
డాదిమబ్రహ్మ జగము సేయంగఁ దలఁచి. ౫౪

గీ. అభినవోన్మేషజిహ్మ మైనట్టిదృష్టి
దిశలు వీక్షించెఁ ద్రిభువనాధీశ్వరుండు
చింతనొంది లోకంబు సృజింప వెఱవు
హృదయమున... ౫౫

ఉ. - - - - లెందణంగిరో
చుక్కలసుద్దియెద్దియొకో చూడఁగఁగందుమె పర్వతంబులన్
దిక్కులచాయ లెవ్వి యని ధీరత నల్వీటుచింత(నొందఁగా)
- - - హ్మాతివిశ్వము ముంచియుండఁగన్.

క. అంతఃకరణంబున నటు
చింతిలి యుండుచుఁ బ్రపంచసృష్టికినిఁ గ్రియా
దంతము లేక దుర్వ్యథ
సంతనకట్టఁగ విధాత చాలం డయ్యెన్. ౫౭

వ. వెండియు బహువిధంబుల నూహాపోహ లొనర్చియుఁ
బుండరీకసంభవుండు భువననిర్మాణక్రియారంభంబునకు
నుపాయంబుఁ గానక చీకాకుపడి కాకోదరగ్రామణికం
ఠగ్రైవేయు భగవంతుం గృతాంతఘస్మరు సంస్మరించి
తత్ప్రసాదంబున వసుంధరాగోళంబు మహాంధకార
మగ్నం బగుట యెఱింగి యజ్ఞగద్ధాత్రుల నుద్ధరింపం
దలంచి. ౫౮

సీ. క్రోడాకారము* దాల్చి కంఠభవఘుర్ఘురధ్వానవిస్ఫూర్తి బా
తాళక్రోడమహాకటాహము సముద్ఘాటింపఁ దత్కుంధరా
గోళస్థాయిని యొనభూమి పృథువక్షోజప్రదేశంబున న్లీ
లాసత్పులకాంకురంబు లెగయ న్వెన్నుండుముస్తెటిలోన్.

గీ. లోఁతుముస్తెటిలోపల నీఁతలాడెఁ
గూటక్రోడావతారుఁడై కైటభారి

* దాల్చెఁగంఠ.

చటులవాలకశాఘాతసంప్రభూత
నీరమందూస్వనంబున నింగి యద్రువ. ౭౦

సీ. కాఁడిపాఱిన మేనిగరులు బ్రహ్మాండంబు
కనుపప్పూబంతి కక్కజము దోఁప
ఖురపుటంబునఁ గీలుకొని మేరుకుధరంబు
మువ్వలోపలి ఱాతిమురువువడయ
దీర్ఘకంఠకఠోరఘుర్ఘురస్వనమునఁ
బాతాళగోళంబు జాతలింప
నీలాంబుదశ్యామనిబిడదేహచ్ఛాయఁ
బ్రళయాంతకాలంబు దోలకరింప
సప్తపాతాళముల క్రిందఁ జాఁగిపడిన
యవని నెత్తె నిశాతదంష్ట్రాంకురమున
నభినవస్తబ్ధరోమదివ్యావతారుఁ
డంబురుహాలోచనుండు కల్పాదియందు. ౭౧

వ. ఇవ్విధంబున మహాపర్వతసన్నిభంబును నీలమేఘప్రకాశంబును దంష్ట్రాదండదారుణంబును విపులవృత్తఘనస్కంధంబును సమున్నతకటితటంబును హ్రస్వవృత్తోరుజంఘాగ్రంబును దీక్ష్ణఖురమండలంబును బద్ధరాగసదృశేక్షణంబును దృఢదీర్ఘమహాప్రోథంబును సముదీర్ణోచ్ఛ్వాసనిశ్వాసవిఘూర్ణితప్రళయార్ణవంబును విద్యుచ్ఛటాపాటలనటచ్ఛన్నకపోలస్కంధబంధురంబును నయినవరాహరూపం బావహించి రసాతలంబున నలిల

మగ్న యగు పృథివి నుద్ధరించిన. ౬౨

గీ. దానవారాతిదంష్ట్ర నెత్తంగఁబడిన
యుర్విచుట్టును జలధి నీరోడ్డి

త వెలిపట్టుజగజంపుగొడుగువోలె. ౬౩

సీ. జయజయధ్వనులతో సనకాదిమునికోటి
వేదాక్షరంబుల వినుతి సేయ
బహుళసౌరభము . . లుప్పతిల్లంగ
విద్యాధర . . విరులు కురియ
దివ్యదుందుభిసముత్థితనినాదంబుల
భూ . . ంభంబు బోరుకలఁగ
జోకయై యప్సరస్సుదతీకదంబంబు
నింగిమీఁదఁ బ్రమోదనృత్తమాడ
జద్దువడియుండె నొకకొంతప్రొద్దు వేడ్క
నవయవంబులు గరుదాల్ప నచ్యుతుండు
ప్రళయజలనిధి క్రింద...పడినయట్టి
యుర్విదంష్ట్రాంకురంబున నుద్ధరించి. ౬౪

గీ. సురలు తనమీఁదఁ బువ్వులసోనగురియఁ
జూడనొప్పారె హరిశరక్రోడమూర్తి
కంధరంబుల ఖద్యోతగణము మొఱయఁ
జాలనొప్పారునంజనాచలమువోలె. ౬౫

వ. ఇవ్విధంబునఁ బ్రలయసలిలోపద్రవంబుఁ దీర్చి ధాత్రిఁ

బూర్వస్థానంబున సంస్థాపించి సర్వసర్వంసహాభారవ
హనంబునం బ్రభవించిన ప్రయాసఖేదం బుజ్జగించుట
కయి పాపసెజ్జపై మున్నీటినట్టనడుమం బవ్వళించి
నారాయణుండు నిజాంతర్గతంబున. ౬౭

శా. దుర్వారోద్యమభంగి దంష్ట్రికతుదిన్ దూరంబుగానైతి
యేఁ, బూర్వస్థానమునందుఁ బెట్టితి యథాపూర్వంబుగా
నిప్పుడీ, యుర్వీమండలి నెట్టివాఁడనొకో యోహో
యంచుఁ జిత్తంబునన్, గర్వించె న్మధుకైటభాంతకుఁ
డుదన్వద్వారిమధ్యంబునన్.

గీ. అంత నిటఁ దాన తానగునబ్జభవుఁడు
దంభక్రోడావతారుఁడై ధాత్రియెత్తి
సాగెఁ బ్రారబ్ధమార్గానుసారమునను
మొదలుకొని యెల్లవిష్టపములు సృజింప. ౬౮

వ. మహత్సర్గంబు భూతసర్గంబు వైకారికసర్గంబునను బుద్ధి
పూర్వకంబు లగుమూఁడును బ్రాకృతసర్గంబులు, ముఖ్య
సర్గంబు, తిర్యక్సర్గంబు, దేవసర్గంబు, మానుషసర్గంబు,
గ్రహాసర్గంబును నానేఁడును బుద్ధిపూర్వకంబులు వైకృత
సర్గంబులు కౌమారసర్గంబు, ప్రాకృతసర్గంబు నీతొమ్మి
దియు ససాధకంబులు సాధకత్వంబును నైహికాముష్మి
కహితాహితతదుపాయతత్ప్రతీకారవిరహితంబునం జేసి
యప్రయోజనంబు లగుట నీతొమ్మిది సర్గంబులవలనను
బ్రయోజనంబు గానక కనకగర్భుండు మహేశ్వరునిం

బ్రస్తుతించితత్ప్రపాదంబునంబురాణప్రజాపతుల (కశ్యప) మరీచి భృగ్వాంగిరసపుల స్త్యపులహక్రతుదక్షవసిష్ఠుల మానసంబునం దొమ్మండ్రను ధర్మాధర్మసంకల్పంబుల మూఁటినిఁగూడఁ బన్నిద్దఱుపుత్రులఁ గాంచె. అపన్నిద్దఱువలననుం బండ్రెండు దివ్యసంశంబులు ప్రజావంతంబులుఁ గ్రియావంతంబులునై ప్రవర్తిల్లె నందు దేవదైత్య దానవమునియక్షగరుడగంధర్వ కిన్నర కింపురుష సిద్ధ విద్యాధరకర్మదేవతాప్సరఃకామినీరక్షోభూతపిశాచమనుష్యపశుపక్షిమృగోరగ కీటక గిరిగ్రావవృక్షలతాగుల్మాదులును, గాయత్రీత్రిష్టుప్సామరథంతరంబులును, అగ్నిష్టోమ హయ మేధవాజపేయాతిరాత్ర పౌండరీకాదులు లోనుగాఁగల చరాచరంబులు ప్రాజాపత్యాంగోపాంగ ప్రత్యంగబుల జనియించె నవ్విధంబున నిఖిలప్రపంచంబు నిర్మించి విరించి నిజాంతర్గతంబున.

ఉ. ఏ నధికుండ నాకుఁబ్రతిమెవ్వరు నిర్జరకోటిలోన నేఁ
గాని జగత్ప్రపంచపరికల్పన సేయఁగ లేఁడు తక్కొరుం
డే నఖిలేశ్వరుండనని యెవ్వరునుం బ్రతికోటిలేమిఁ దాఁ
దానయహంకరించెనువిధాతసదాశివుమాయపెంపునన్.

వ. ఇవ్విధంబుఁ నవష్టంభంబు గైకొని యంభోరుహసంభవుండు తాను సృజియించినభువనంబులువీక్షింపందలంచి రాయంచ తేరెక్కి దిక్కులఁ జరించువాఁడుముందట. ౘ౦

మహాస్రగ్ధర. అటఁ గాంచెం బద్మగర్భుం డహిమకరధూళీ

హాస్తినక్రాదియాదః, పటలీ ధాటీవిహారప్రచలితమహీభృ
త్కృతువిక్షేపలీలా, చటులోర్మివ్యాప్తఘోషాసముపచిత
దిశాసౌధవీథీవిటంకా, పటుసంఘాటాప్రతిశ్రుద్భయక
లితజగద్వ్యాప్తిలబ్ధి న్సుధాబ్ధిన్. ౭౨

లయగ్రాహి.

తో. యజభవుండు మదిఁ బాయని యహంకరణమాయను జగం
బుల కపాయము ఘటింపం, జేయ సమష్టి ఫణిశాయి
నిరుపాధిశుభదాయకుసు రాసురనికాయమకుటాగ్రస్థా
యి కురువిందసముదాయఘృణికోటివిశదాయతపదద్వ
యుఁగళాయుతునిశ్రీనా, రాయణురమారమణుడాయఁజని
నిద్దురకు రాయిడిగ నెవ్వఁడవు రా యనుచుఁ బల్కెన్. ౭౩

క. లేలె మ్మెక్కడివాఁడవు
పాలసముద్రమున భోగిపర్యంకమునం
దేలెద వొక్కండవు నను
ద్రైలోక్యాధీశు నెఱుఁగురా పరమేష్ఠిన్. ౭౪

సీ. పాతాళభువనసప్తకము నిర్మించితి
వానితి విశ్వవిశ్వంభరయును
దిక్చక్రవాళ మెత్తితిఁ జక్కఁజేయఁగాఁ
బాదుకొల్పితి గోత్రపర్వతముల
వరుసఁదీర్చితి నేడుశరనిధానములకు
నారువోసితి నరణ్యములు పెక్కు

గ్రహతారనక్షత్రగతు లేఱుపఱిచితి
సరణు లేర్చితి నభస్స్వాంతమునకుఁ
గదియఁ గూర్చితి బ్రహ్మాండకర్పరంబు
పరిధిగా వాల్చితిని మహావరణజలము
నిట్టినేఁ జేరవచ్చిన నెదురుగానవు
పాన్పు డిగ్గవు దురవలేపమున నీవు. ౭౫

గీ. ఎవ్వఁడవు చెప్పుమనిన లేనవ్వు నవ్వి
యిందిరావల్లభుఁడు బ్రహ్మ కిట్టులనియె
నే జగత్కర్తనై యుండ నెట్లు నీవు
కర్తనని పల్కెదవు సిగ్గుగాదె చెపుమ. ౭౬

గీ. వినియెఱుంగవె కల్పాంత వేళ నేను
దంభక్రోడావతార ముద్ధతి వహించి
సర్వసర్వ - - - సరణి
వాల్చినాఁడను దంష్ట్రికాదండకోటి. ౭౭

శా. ఏలావచ్చెదుడాయ నెవ్వఁడవు నీవెచ్చోటికింబోయెదీ
వేలా మ్రొక్కవు నాకు గర్వమిఁక నెంతే నోర్వకుండుంజుమీ
త్రైలోక్యాధిపుఁడన్ సురాసురశిరోరత్నప్రభామండలీ,వ్యా
లీఢాంఘ్రిసరోరుహుండవిడుగర్వారంభసంరంభమున్.

గీ. అని వసుంధర నుద్ధరించినబలంబు
భువనసర్గం బొనర్చినపూనికయును
గారణంబులుగాఁగ నాగ్రహముపూని
యచ్యుతుండును నజుఁడు గర్వాంధులగుచు. ౭౯

వ. ఒండొరు నెఱింగిన యయ్యిద్దఱు మహేశ్వరుమాయా
ప్రభావంబున. ౮౦

గీ. నన్ను గెల్చి కదా నీవు నలిననాభ
యఖిలలోకేశ్వరుఁడ వౌట యనియె బ్రహ్మ
నన్ను గెల్చి కదా నీవు నలినగర్భ
యఖిలలోకేశ్వరుఁడవౌట యనెయె శౌరి. ౮౧

వ. అని యవష్టంభవిజృంభణంబున. ౮౨

గీ. ఇందిరానాయకుఁడు శార్ఙ్గమెక్కు వెట్టె
గాండివముసజ్యముగఁ జేసెఁ గమలభవుఁడు
శరము లిద్దఱుఁ గాలాగ్నిసన్నిభంబు
లేసి రొండొరుపై శౌర్యమెసక మెసఁగ. ౮౩

మ. జవ మేపారి మురారి పద్మజభుజాచక్రీభవచ్ఛార్ఙ్గగాం
డివకోదండవినిర్గతప్రభల సందీప్తాస్త్రసంఘాతముల్
భువనక్రోడము నిండి భానుకిరణంబుల్ దాఁటనీకుండుటం
బవలుం బర్వెమహాంధకారములుపైపై నూచిని ర్భేద్యముల్

గీ. గాండివము తేరిపైఁ బెట్టి కమలభవుఁడు
శార్ఙ్గమున నచ్యుతుం జేయుసాయకముల
గర్కశం బైనకుశపూలకముస వ్రేసి
ఖండఖండములుగఁ జేసెఁ గగనవీథి. ౮౪

క. వాలిక మెఱుంగుఁదూపులు
నాళీకాసనుఁడు కినుక నారాయణుపైఁ

గీలుకొనఁ జేసి యార్చెను
నాలుగుమోములను త్రిభువనము వణఁకొడన్. ౮౬

వ. ఇవ్విధంబున విధాత యార్చి పేర్చినఁ గోపాటోపంబునం గటకటంబడి కైటభాంతకుండు లలాటపీఠవిటంకంబున భ్రుకుటి నటింపఁ గల్పాంతవేళాసముజ్జ్వలజ్జ్వలనజ్వాలాజాలలీలాక్రీడావహామహాప్రభామండల మధ్యవర్తియు విబుధరిపువధూవైధవ్యదానదీక్షాధురంధరప్రభావరాక్రమక్రీడానిర్వక్రపరాక్రమం బగుచక్రం బతనిమీఁదఁ బ్రయోగించిన. ౮౭

మ దిశలున్నింగియు నేలయుస్వహులదీప్తివ్యాప్తిసంతర్పవింప శతానందునిమీఁదసాగుటయునప్పద్మాసనుండేసె బ్రహ్మశిరోనామక మైనయస్త్ర - స్వాపాదిద్దేశంబు నవ్విశిఖంబుద్ధతిస్రింగె నద్భుతగతిన్వేగ నాచక్రమున్.

గీ. హరి విధాతపైఁ బాశుపతాస్త్రమేసె
నజుఁడు హరిమీఁదఁ బాశుపతాస్త్రమేసె
సమ్మహాస్త్రంబు - -
- - ములును ౮౯

చ. పటుతరవిక్రమస్ఫురణఁ బాశుపతంబులు -ండుఁబోరఁగాఁ జటిలినవిస్ఫులింగములఁ జిల్లులు వోయె నభఃస్థలంబు దిక్తటము - - - గర్భగోళసం, పుటములు వ్రాక్కనుమ్మదముప్పట్టఁ జెమర్చెఁ బురాణకూర్మమున్.

ఉ. పాశుపతాస్త్రరాజములభంగధృతిందమలోనఁబోరఘోరాశనిఖండసన్నిభము లైనతదీయకృపీటసంభవో

లాఁ కితము ల్పరస్పరవిఘట్టనఁ జిచ్చులుఁ గ్రోలలై వెసం
గేశవుమేన బ్రహ్మమెయిఁ గేలియొనర్చె నపారవేదనన్.

ఉ. కాంచనగర్భుఁడు న్నరకఘస్మరుఁడున్ బహుకాలమీ
క్రియం, గాంచిరినొచ్చి పాశుపతకాండయుగప్రభవాగ్నికీలలం
జంచలచిత్తవృత్తి బహుసంపదపెంపున మూరివోయి ద
ర్పించినయట్టివారికిఁ పెద్దలె యచ్చెరువంద నేటికిన్.

గీ. పాశుపతములు రెండు నిభంగిఁ బోర
నజుఁడు హరియును వారింప నలవిగాక
విస్ఫులింగచ్ఛటావళి వేష్టనమున
స్రుక్కుచుండిరి యంగముల్ సొక్కిపడఁగ. ౯౩

గీ. త్రిభువనంబును భయమందె దేవదైత్య
ఖచరసిద్ధగంధర్వులు కలఁగఁబడిరి
అస్త్రరాజద్వయంబు సంహారకాల
దహనుభంగి నేకాంగయుద్ధంబు సేయ. ౯౪

గీ. అస్త్రయుద్ధము మాన్ప హర్యజులఁ గావఁ
దలఁచి యర్ధేందుమౌళి యత్యంతకరుణ
నస్త్రములు రెంటినడుమ నయ్యవసరమున
సంభవించె మహాస్తంభ శంభుమూర్తి. ౯౫

స్రగ్ధర. స్తంభం బావిర్భవించెన్ జ్వాలదనలశిఖా
జాలముల్దిక్కులందుం
జృంభించెన్ భూర్భువస్స్వస్థిరతరజఠర
క్షేత్రముల్బంచదులాఁ

సంభారోద్యత్స్ఫులింగసంగతములుగనా
శంకవిశ్వంభరుండున్
శంభుండున్సంభ్రమింపంజటులాంగారతటి
త్సన్నిభస్ఫూర్తి మూర్తిన్.

సీ. సప్తపాతాళవిష్టపములు భేదించి ధరణి
చక్రంబు భిందఁ బొనర్చి
భూర్భువస్స్వర్లోకములు సమున్స్ఫోటించి
ధ్రువమండలంబుఁ దుత్తుమురుచేసి
పరమేష్ఠిపదవి కుద్భ్రాంతి యాపాదించి
హరిపదంబున కార్తి యావహించి
బ్రహ్మాండకుహరకర్పరము వ్రక్కలుసాపి
యావరణంబు లందంద చించి
పరగఁ బుష్కరమార్గంబు పాయఁబట్టి
యెగసి యెచ్చోటికేగెనో యెఱుఁగరాదు
శాతకుంభాద్రికూటాగ్రసన్నిభంబు
శాంభవం బైనపావకస్తంభ మపుడు. ౯౭

గీ. పొలుగల యగ్నికంబంబు ప్రభవమొంది
యుష్ణమును శీతమును గాక యుండెఁ గాని
యహహ పెల్లు జగం బుష్ణ మయ్యెనేని
శిశిర మగునేని వణఁకును సీతువట్టి. ౯౮

సీ. అద్భుతం బందిరి హరియుఁ బద్మభవుండుఁ
దమలోని తీవ్రరోషములు మాని

పుష్కలావర్తకాంభోధరవ్రాతంబు
  గురిసెఁ గల్పకలతాకుసుమవృష్టి
జయజయధ్వనులతో సనకాదియోగీంద్రు
  లభినుతించిరి ప్రస్ఫుటాక్షరముల
నమరదుందుభినినాదములు దిక్కులనిండె
  గంభీరతరమహాఘనరవముల
నణఁగె నస్త్రద్వయంబు నభ్యంతరమున
నగ్నికంబంబులోఁ గానవచ్చె శివుఁడు
వలిపె తెరలోన నున్న భావంబుదోఁప
మాఘకృష్ణచతుర్దశీమధ్యరజని. ౯౯

గీ. హంసరూపంబుదాల్చెఁ బద్మాసనుండు
దంష్ట్రిరూపంబుగైకొనె దనుజరిపుఁడు
పోయి రంబరమున కధోభువనమునకు
నూర్ధ్వమును గ్రిందుఁ గానంగ నుత్సహించి. ౧౦౦

క. బహువర్షసహస్రంబులు
ద్రుహిణుండును హరియు నధ్యధోభువనములన్
బహులక్రియ శోధించిరి
దహనస్తంభంబుతుదయుఁ దన్మూలంబున్. ౧౦౧

వ. శోధించి యాద్యంతంబులు పొడగానక హరివిరించులే
తెంచి వామదక్షిణంబుల నిలిచి జగత్కారణంబయి
నయమ్మహాదేవు నిట్లని స్తుతియించిరి. ౧౦౨

సీ. శర్వ లోకాధీశ చంద్రార్ధశేఖర
పురుష పురాణ శంకర మహేశ
యభవ యంతర్యామివై ప్రేరకత్వము
చేపట్టి జనుల శాసింతు వీవు
భవదీయమాయాప్రభావంబు కతమున
నెఱుఁగలేకుంటిమి యేము నిన్ను
మాకుఁ గర్తవు నీవు మాకు భర్తవు నీవు
మాకు హర్తవు నీవు మాట లేల
నీమహత్త్వంబు వర్ణింప నేర మేము
నిన్నుఁ దెలియంగ నేరము నిజముగాఁగ
నభవ యాద్యుండ వాద్యుండ వగుదు గాన
నట్టి నీకాచరింతుము సాష్టి మెపుడు. ౧౦౩

గీ. పశువులము మేము హర పశుపతివి నీవు
పశువులకు నెక్కడిది బుద్ధి ఫాలనయన
రాజశేఖర నేర్పునేరములు చూడక
కరసి రక్షింపు మమ్ము నత్యంతకరుణ. ౧౦౪

గీ. విష్ణుమూర్తులు కడచన్న వేళలందు
నజునిమూర్తులు కడచన్న యవసరమున
విశ్వమూర్తులు విబుధులు వెడలునపుడు
కలదె నీకు నపాయంబు కాలకంఠ. ౧౦౫

గీ. అమరవంద్య దివాభీత మనెకిపుఁడుఁగు
హేళిమండల మీక్షింప నెట్లు నేర్చు

నేము నిను వినుతింపఁగ నెంతవార
మిమ్మహాపరాధము క్షమియింపవలయు. ౧౦౬

వ. అని స్తుతియించినం బ్రసన్నుండై విరూపాక్షుం డాక్ష
ణంబ లింగమధ్యంబున వెడలి యర్ధనారీశ్వరుండును
త్రినేత్రుండును నీలలోహితుండును వరదాభయమృగాం
కధరుండును సర్వాభరణభూషితుండును బ్రమథగణ
సమన్వితుండును గోటిసూర్యప్రకాశుండును బాలచం
ద్రావతంసుండును నై సన్నిధి యగుట యుఁ బెన్నిధిఁ
గన్న పేదల విధంబుంబోలి విరించినారాయణు లిట్లనిరి.

సీ. ఇభచర్మపరిధాన యేభక్తి చేసిన
సంతసం బందు నీయంతరంగ
ముడురాజమౌళి యేయుపచారములు నీకుఁ
బ్రియములై యుండు నెంతయును గరిమ
నగరాజకన్యకాప్రాణేశ నీకు
నేకళలనఁ బో సర్వాంగకృప జనించుఁ
గ్రతువైరి నీకు నేవ్రతముఖ్య మొనరింపఁ
గాతుకో స్నేహంబు గలిగియుండు
నంధకాసురదమన నీ కభిమతంబు
లేయనుష్ఠానములు శర్వ యేమఖంబు
లాచరించిన నీవారమగుట యట్టు
లభవ దాక్షిణ్యపరత మా కానతిమ్ము. ౧౦౭

వ. అనినఁ బ్రీతచేతస్కుండై శివుండు విశ్వంభరాంభోరుహాసంభవుల కిట్లనియె.

మ. అవధానంబుననాకునంశ్రయము సేయన్సర్వదామీకున
ధ్యవసాయంబొడఁగూడెనేనివినుఁడాయంభోజదృగ్భాగతీ
ధవులారావినియాచరింపుఁడుమదిందాత్పర్యమొప్పంగ శ్రీ
శివరాత్రివ్రతమస్మదీయమదిదాక్షిణ్యంబునంజెప్పితిన్.

వ. బ్రాహ్మీముహూర్తంబునందు మేల్కని శౌచక్రియలు నడపి గురున కభివాదనంబు సేసి సంకల్పంబునడపి పూజోపకరణద్రవ్యంబులుసమకూర్చుకొని నదీస్నానంబు వొనర్చి నిత్య నైమిత్తికా ద్యనుష్ఠానంబులు దీర్చి యలంకృతుఁడయి యజనస్థానంబును సమ్మార్జనలేపనాదుల శోధించి వితానధ్వజంబు లెత్తించి పతాకావలులు గట్టి తోరణంబులు సంఘటించి దేవాలయంబు ప్రవేశించి మౌనియై భసితత్రిపుండ్రంబును భస్మోద్ధూళనంబును గావించి రుద్రాక్షమాలికలు ధరియించి శివభక్తుల రావించి గురూపదేశమార్గంబున నాసనంబుఁ బాద్యం బర్ఘ్యంబు మధుపర్కంబు నిచ్చి పంచవదనంబులుఁ బంచామృతంబుల నభిషేకించి ఫలోదక పుష్పోదక గంధోదక కుంకుమోదక రత్నోదక కర్పూరోదకంబుల నభిషేకించి వస్త్రం బుపవీతం బాచమనంబు గంధంబు భూషణంబు పుష్పంబు ఫలాహారంబు నీరాజనంబు ధూపంబు వ్యజనంబు వాదిత్రంబు దర్పణంబు స్తోత్రంబు

మొదలుగాఁ గలషోడశోపచారంబుల నుపచరించి నాలు
గుజాలు జాగరంబు సేయునది యీవ్రతచర్యప్రకారంబు.

గీ. బ్రహ్మహత్యాయుతము సురాపానశతము
వీరహత్య గోహత్యలు వేనవేలు
శిశువధంబులు జంగమ(శ్రీవినాశ)
మాది యగుపాపములఁ దోలు నభవురాత్రి. ౧౧౨

వ. తొల్లి యొక్కబ్రాహ్మణుండు మహాపాపంబులు సేసి శివ
రాత్రిదర్శనంబున శివపురంబునకుం జనియె ననిన శౌ
నకాదు లక్కథకున కిట్లనిరి. ౧౧౩

గీ. అద్భుతం బయ్యెడిని మాకు నగ్రజన్ముఁ
డెట్టి పాతకములు సేయు నెట్టు లట్టి
పాపి శివరాత్రివ్రత మెట్టు పరఁగఁ జూచె
నంతయును విస్తరింపుమా యనినఁ బ్రీతి. ౧౧౪

శా. జీమూతాన్వయ రాజధైర్యనుమహాక్షీరాబ్ధిగాంభీర్యను
త్రామప్రోద్భవగాఢశౌర్య సుమనోధన్వాతిసౌందర్య పా
లోమీనాయకతుల్యభోగయుత సుశ్లోకారిజిత్త్యాగ భా
షామాధుర్యమతిప్రకాశధిషణా సత్యార్థసంభాషణా.

క. నిత్యయశశ్శ్రీసుందర
మత్స్యమురాచార్యవర్య మాన్యచరిత్రా

భృత్యజనావనతత్పర
సత్యహరిశ్చంద్ర సరససాహిత్యనిధీ. ౧౧౬

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయప్రణీతం బయిన శివరాత్రిమాహాత్మ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

## (సుకుమారచరిత్రము)

### ద్వితీయాశ్వాసము.

క. శ్రీహిమవద్గిరిపుత్త్రీమ
నోహరపదభక్తిజాతనూతనసరస
వ్యాహారకావ్యనాయక
మోహనతనుజితజయంత ముమ్మయశాంతా. ౧

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లని చెప్పం
దొడంగె. ౨

సీ. కాంచనాచలముతో గర్వించి యేకొండ
పెరిఁగె బ్రహ్మాండకర్పరము మోవ
నేకొండచఱులపై హిమశైలకన్యక
చెంచు లేమలఁగూడి సంచరించు
వజ్రాలకమరుఠేవ విడంబనము సేయ
నేకొండ మొలచుట్టు నిందుతనయ
యల్లానేరెడుదీవియవనీధ్రములలోన
నేకొండ కైశ్వర్య మెక్కుడయ్యె

నట్టివింధ్యనగేంద్ర పర్యంతభూమి
దండకారణ్యవిపినమధ్యంబునందు
రత్నపుర మనఁ గల దొక రాజధాని
కిన్నరాధీశునగరికిఁ గీడువెనిచి. 3

గీ. స్ఫటికమాణిక్యపాషాణ ఘటితమైన
యప్పురముకోట యాకాశ మంటి యొప్పు
వేడ్కఁ బాతాళభువనంబు వెడలివచ్చి
చుట్టుచుట్టినయట్టివాసుకియుఁ బోలె. ౪

గీ. పట్టణంబున దేవతాభవనకోటి
తుహినగిరికూటములతోడఁ దులలుతూఁగు
నమరగంగాపయఃప్రవాహములఁ బోలుఁ
దచ్ఛిరస్స్థాపితోన్నతధ్వజపటములు. ౫

సీ. మకుటదేవకిరీటమణిమయూఖచ్ఛటా
పటలికిమ్మీరితాంఘ్రిపంకజుండు
వికటపాటలజటామకుటకోటిఘటిత
కోమలతారకాకాముకుండు
గంధదంతావళకృత్త్యాదరాటపత్రి
కంథాధురంధరకంధరుండు
కుంభినీధరసుతాకుచకుంభమృగనాభ
సాంద్రసంగతవక్షఃస్థలుండు
శంభుఁ డోంకారనాథుండు శాశ్వతుండు
పాయకయ యుండు నప్పోటిపరిసరమున

నర్మదాసింధుతీరకాంతారభూమి
మత్తి యనుపేరికల్పద్రుమంబు మొదల. ౬

వ. అప్పట్టనంబునకుఁ జుట్టును జనపదంబు లీలావతీశతద్రువి
పాట్సింధునదీమాతృకంబులును, విశ్వవిశ్వంభరాభ్రాల
తానుకారి సేతురేఖాలంకారంబులును, దటాకతరు
కుసుమకేసరతుందిలమందమకరందధారాధోరణీసహస్ర
సంవర్ధితకుల్యాసలిలకల్లోలమాలికాస్ఫుటస్ఫాయమాన
నానావిధోద్యానవాటికాసంఘసంఘటితాకాలకాలాం
ధకారంబులును, నారామచూతపోతనికరసుకుమారకిస
లయాస్వాదకషాయకంఠకలకంఠకామినీకోమలకుహూ
కారకోలాహలాంకురితపంచమరాగరాజంబులును, రా
జాన్నకలమషాష్టికపతంగప్రియనానావ్రీహిసస్య
ప్రశస్తంబులును, బ్రవర్ధమానవనంబులును, నిబిడితసార
సికంబులును, గుళుత్థాభ్యుత్థానంబులును, సముద్గతము
ద్గసామగ్రీసంగ్రహంబులును, అణుకచణకచణంబులును,
సిద్ధార్థశ్యామాకగోధూమశర్కరాతిలజర్తిలంబులును,
అదూషితమహాకోరదూషితకోష్ఠమంబులును, కుస్తుం
బురుకునుమగుచ్ఛచ్ఛాయాచ్ఛటాభృంగశోణభంగో
మాణుశృంగారితజాంగలక్షేత్రంబులును నై దాశరథిచరి
త్రంబునుం బోలె సీతావృత్తిసరళంబును, జంద్రోదయం
బునుం బోలెఁ గరసహస్రసంవర్ధితరత్నాలయంబును,
యదువంశంబునుంబోలెఁ గులక్రమాగతశూరపురుషో
త్తమబలాభిపాలితంబును నై యుండు వెండియు. ౭

మ. పరలోకస్థుఁ బతిఁగ్రా ఝషాంకు బ్రతికింపంగోరి యోం
కారశం, కరుమ్రోలన్ రతిము క్తకంఠముగనాక్రందించె
నానొప్పు న, ప్పురబాహ్యోపవనాంతదీర్ఘికలనా ...
...నోలాడువు, స్ఫురకింజల్కభుజిక్రియాసుఖిత హంస
క్రేంక్రియారావముల్.

మ. ధరణీచక్రముఁ బోలెనప్పురము విస్తారంబునా యామముం
బరికింపంగ నశక్యమైనగరిముం బాథోధిగంభీరతం
బరిఖామండలమంబురాశినుపమింపం బాత్రమైయొప్పసం
బరకల్లోలలురతిమింగిలఘులీమత్స్యాహినక్రోద్ధతిన్.

గీ. భద్రజాతియేనుంగు లప్పట్టనమునఁ
బ్రకటితస్ఫూర్తి నొప్పు సిబ్బములతోడ
విమలవారాశి ఫేనఖండములతోడి
కవ్వపుంగొండబందులో కాక యనఁగ. ౧౦

ఉ. లక్షలసంఖ్యలప్పురికెలంకుల యందుఁ గొలంకులొప్పు వా
పక్షిగరుచ్ఛటాపవనపాతవికంపితపంకజంబులై
వీక్షణకౌతుకంబు ప్రభవించుచునుండును లీలమై సహ
స్రాక్షుఁడు విశ్వరూపమహిమాద్భుతముం బ్రకటించెనో
యనన్. ౧౧

శా. ఆవింధ్యాచలదుర్గమేలు శబరాధ్యక్షుండు హేమాం
గదుం, డావార్ధిద్వితయవ్యయావధిగఁ జక్రాధీశ్వరుల్
గొల్వ నా, శావేదండఘటాకపోలతలమూర్ఛద్దానధా

రాజుల, స్లావప్రక్రమసంవిశుద్ధబహులప్రస్ఫూర్తిమ
త్కీర్తియై.

సీ. శివునికై వడి మహాసేనానియాత్తుండు
బలభేదిపగిది నపవ్యపాయుఁ
డరవిందహితులీల నధిగతాభ్యుదయుండు
బుధుని క్రియ నజహత్స్వపక్షరుండు
గంగాప్రవాహంబు కరణిఁ బావనమూర్తి
భుజగాధిపునిభంగి భోగశాలి
యేనుంగుచందాన దానధారాశోభి
శౌరిలాగున శంఖచక్రపాణి
కర్తయైశ్వర్యములకు నాకరము నీతి
కఖిలవిద్యాగమములకు నాస్పదంబు
పగఱ కుత్పాతకేతువు బంధుకోటి
కమరలోకద్రుమంబు హేమాంగదుండు. ౧౩

గీ. ఆనృపాలుండు నీతివిద్యానిరూఢిఁ
జారదృష్టి యాఁ గాని విచారదృష్టి
సమధికైశ్వర్యవైభవోజ్జ్వలత నాతఁ
డష్టమూర్తియాఁగాని యనష్టమూర్తి. ౧౪

—: యజ్ఞదత్తచరిత్రము :—

వ. ఆరాజునకు నఖిలశాస్త్రవిద్యాకళాపావనగంభీరబుద్ధి యజ్ఞదత్తుం డనుబ్రాహ్మణుండు దేవేంద్రునకు బృహస్పతియును వృషపర్వునకు శుక్రుండును దశరథునకు వసిష్ఠుం

డును రామునకు విశ్వామిత్రుండును నజాతశత్రునకు
ధౌమ్యుండును నలునకు దమనుండునుం బోలెఁ బ్రధాని
యై రాజ్యభారంబు భరియించియుండు నమ్మంత్రి భార్య
వినయవతి వివేకవతి విభ్రమవతి విలాసవతి సౌభాగ్య
వతి లక్షణవతి యౌదార్యవతి గాంభీర్యవతి యన సర్వ
గుణసంపూర్ణసుశీలాభిధాన యగుబాలారత్నం బతనికిఁ
బరమప్రియాస్పదంబై యుండు. ౧౫

గీ. అన్నిభాగ్యంబు లున్న నాయబ్జముఖికి
శ్రీమహాలక్ష్మిగలుగఁగ నేమిసెలవు
పుత్రవదనావలోకనోద్భూతమైన
యొక్కసౌఖ్యంబు ప్రాఁతియై యుండుఁ గాన. ౧౬

గీ. తనయసంతానలబ్ధి దాదవ్వుగాఁగ
విభవసంపత్తిగల్గియు విన్నఁబోయి
వనిత నిష్ఫలపుష్పదర్శనముఁ దాల్చె
శరలతాకాననముఁబోలె జవ్వనంబు. ౧౭

సీ. కాంతపుష్పాదిభోగంబు లింపెసఁగిన
వైరాగ్యవిధికిఁ దావాల్చుఁ జిత్త
మన్వయంబునకుఁ దా నాలంబమయ్యును
దను నిరాలంబఁగాఁ దలఁచు నింతి
ప్రొద్దునఁ దగినట్టి భోజనం బొల్లక
యుపవాసనంబుండ నువిద దలఁచు
సంపత్పరంపర సంభవిల్లిననైన
సంతోషమొదవదు చామమతికిఁ

గోష్ఠలాంగుళదళహస్తతామరసము
కర్ణపూరత్వలీలకై కాలు సాఁప
గండతలదర్పణంబునఁ గదియఁ జేర్చి
పడఁతి చింతించు సుతలబ్ధి వడయుటకును. ౧౮

ఉ. సంతతి లేనిదుఃఖమున సామజరాజఘటాంతవైభవం
బెంతయుఁగల్గియున్ సరసిజేక్షణచిన్నగఁబోయియుండునే
మంతిని బోటికత్తెలకుమానసవృత్తిమెఱుంగఁజెప్ప కే
కాంతమ కేళిశయ్యపయిఁగాంతగణించుమనోరథార్థముల్

ఉ. ఆచపలాయతాక్షికనకాంబురుహంబులఁబూజసేయువిం
ధ్యాచలకందరానిలయ నద్రిసుతాప్రియనాథునర్ధదా
వీచిపరంపరాసలిలవిప్రుషదాశ్రయశీతగంధవా
హోచమునప్రవృద్ధభుజగాధిపకంకణు నోంకృతీశ్వరున్.

సీ. అభిషేక మొనరించు నలినీలకుంతల
శంభు సోమోద్భవాసలిలధార
నెలఁత యభ్యర్చించు నీలోత్పలంబులఁ
దరణనిర్మలసుధాధామమౌళి
గరళకూటగ్రాసకల్మాషకంధరు
మీన గంధ మలందు మీననేత్ర
యర్పించు దివ్యోపహారంబు లెలనాఁగ
కుటిలకుండలిరాజకుండలునకు
నతివ దిరుగుఁ బ్రదక్షిణం బభవుగుడికిఁ
గుచభరంబున నరగౌను కూనుగిలఁగ

రవలిమట్టెలమ్రోఁతలో రాయిడింపఁ
జరణనూపురఝుళఝుళంఝుళరవంబు. ౨౧

వ. ఒక్కనాఁ డోంకారనాథునకుఁ బ్రదక్షిణం బాచరించుచు నప్పద్మాక్షి ప్రాకారపురఃప్రఘాణంబున నొక్క పౌరాణికుండు మహాభారతంబు వక్కాణించువాఁ డపుత్రకులకుఁ బుణ్యలోకంబు లేదని కథానుకథనప్రసంగంబునం బలికిన నయ్యింతి సంతానవిరహవేదనాదూయమానమానసయై మందిరంబున కేతెంచి యేకాంతభవనంబున విరహశయ్యపై మేను వైచి చింతాక్రాంతయై యుండె నంత యజ్ఞదత్తుం డమ్మత్తకాశిని నన్వేషించి. ౨౨

ఉ. కాంతసరోజనాళలతికాతనుపాండుశరీరయష్టి నే
కాంతగృహాంతరస్థితఁ బ్రియాంగనఁ జేరఁగవచ్చె మంత్రి క
ల్పాంతమునన్ రసాతలగుహాంతవిహారంబునఁ డాఁగియున్నభూ
కాంతవరాహమూర్తిహరిఁ గ్రచ్చఱడాయఁగవచ్చుకైవడిన్.

వ. డాయవచ్చినఁ గృతప్రత్యుత్థానయగు నప్పంకజాక్షియుఁ దానునుం బర్యంకంబునఁ గూర్చుండి యవిరళాశ్రుపాతార్ద్రీకృతదుకూలయు ననలంకృతయునైన సుశీలం జూచి యజ్ఞదత్తుం డిట్లనియె. ౨౪

గీ. ఏల యేడ్చెదు చెప్పవే యిందువదన
విపులశోకభరంబున వెక్కివెక్కి
త్రాటఁ గ్రుచ్చినముత్యాలదండవోలెఁ
జన్నుఁగవనున్న నీబాష్పజలకణములు. ౨౫

సీ. కుదురునిండినమంచిగుబ్బచన్నులమీఁద
ధరియింపవేల ముత్యాలపేరు
ఫాలేందురేఖపైఁ బచరింప విదియేల
కుంకుమంబున బొట్టు గోరఁ దీర్చి
యూసచక్రోద్ధురం బగునితంబముమీఁద
నసరింపవేల వజ్రాలకమురు
పాయవట్టములలోఁ బసిఁడినూపురములు
పూన్పింపవేల పాదాంబుజములఁ
బంచవన్నెయరాచిల్కఁ బంజరమున
నేల నడిపింప నటగాఁగ మోసక మొసఁగ
నేల చింతించెదవు చెప్పు మిందువదన
గండపాళికిఁ గెంగేలు గదియఁజేర్చి. ౧౬
గీ. నెలఁత నీలివేఁడియైన నిసిదు యూర్పు
మాటిమాటికి సఖుఁడు నామానసంబుఁ
గంపమొందించుచున్నది కల్లగాదు
ప్రబలభవదీయవక్షోభనంబుఁబోలె. ౧౭
క. అపరాధము సేయఁ గదా
చపలాయతనేత్ర! యేను జనవున నేని
న్నిపుణతతోఁ జింతించిన
నెప మేమియుఁ గానరాదు నీనెగులునకున్. ౧౮
క. భవదాయత్తము విభవము
భవదాయత్తంబు సువ్వె ప్రాణము నాకున్

భవదాయత్తము సర్వము
ధవళాంబుజపత్రనేత్ర తథ్యం బరయన్. ౯౯

వ. ఈదుఃఖంబునకుం గారణం బేమి చెప్పు మని యడుగుట
యుం బ్రత్యుత్తరం బీక యూరకున్న దాని తాంబూల
కరంకవాహిని నాప్రియసఖి నిట్లనుః- గేహదైవంబు కరు
ణంజేసి పెద్దకాలంబు విమ్మహాదేవు సంతానలాభంబు
దూరం బగుటకారణంబుగా శయనాసనపానభోజన
విభూషణపరిధానాదిసముచితవ్యాపారంబులు పరిజన
ప్రయత్నంబునం బ్రవర్తనంబు నెట్టకేలకు నిర్వర్తించుచు
దేవరకు హృదయవేదన గానిపింపనోపక యనవరతంబుం
దోపకుండం జరియించుచున్నయది. యిన్నటి రేపుతపన
మండలంబు కుపితకపికపోలక్రోడతామ్రంబై యుదయ
గిరికవాటపిటకంబు నలంకరింప వింధ్యాచలనితంబ
బింబంబునకు మణిమేఖలాకలాపంబునుం బోలిన నర్మదా
ప్రవాహంబునం గ్రుంకి యోంకారేశ్వరు శశాంకశిఖా
లంకారు హేమపంకజంబులం బూజించి గుడికిం బ్రద
క్షిణంబు సేయునది దేవభవనప్రాకారగోపురప్రఘాణంబు
నం బౌరాణికుండు మహాభారతంబు వక్కాణించుచుం
గథానుకథనప్రసంగంబున నపుత్రకులకుం బుణ్యలోకం
బులు లేవని పలికిన నప్పలుకులు నెమ్మనంబునం గీలు
కొని వాలంపములికియుంబోలె వేదన యుత్పాదింప
భవనంబునకు వచ్చి యేకాంతంబ యిచ్చోట నవిరళ

బాష్పధారాదుర్దినాంధకారితముఖియయి యీదుర్దశం
బొంది యున్నయది యనుటయు. ౩౦

గీ. మంత్రి యొకముహూర్తమాత్రంబు చింతించి
యుష్ణదీర్ఘమైన యూర్పు నిగుడ
నెంతచింత దీని కిది మహాబలవంత
మేమి సేయవచ్చు నిందువదన. ౩౧

ఉ. ఊరక కుంద నేమిటికి నోంకృతినాథుఁడు నర్మదానదీ
తీరనివాసభక్తజనదివ్యమహీరుహమున్ సదాశివున్
(?)సారసనేత్రతత్పదపరిష్టయభీష్టశుభాభివృద్ధికిం
గారణమౌట నెఱుంగవె వికారము నక్కుభజింపు శంకరున్.

గీ. ఈశ్వరుండు ద్విజానాథుఁ డిందుమౌళి
కరుణలేకను సుతుఁ డెట్లు కలుగ నేర్చుఁ
జంద్రచందనచంద్రికాశైత్యమైన
పుత్రపరిరంభసౌఖ్యంబు పువ్వుఁబోఁడి. ౩౩

గీ. గురుజనంబుల సేవింపు కువలయాక్షి
కనులలోఁ జన ముక్కంటికరుణఁ జేసి
మున్ను గురునుపదేశంబు మొనయఁ గాంచి
రభిమతార్థంబు లెందఱో సజ్జవదన. ౩౪

వ. సర్వజగత్ప్రసిద్ధంబుగదా యితిహాసంబు తొల్లి చండ
కౌశికువరప్రసాదంబున మగధాధిపతియగు రాజు దైతేయ
యకులవిమర్దను గెలువం దగినయట్టి శౌర్యనిధి జరాసం
ధుం గాంచె దశరథుండు విభాండకతనయు నారాధించి

దిగ్గజంబులం బోలి వసుమాపులు సకలలోకహితంబుగా
నలుగురుం బడసె సమారాధిత గురుదేవతా ప్రార్థన
వశంబున. ౩౫

గీ. వెలఁది పుత్త్రోదయారంభవేళ యందు
నిన్ను నెన్నఁడు చూతునో కన్నులార
విమలచంద్రోదయారంభవేళయందుఁ
బూర్ణిమాయామినినిఁ బోలెఁ బుణ్యగరిమ. ౩౬

వ. దేవి శోకంబు విడుపు ధైర్యం బవలంబింపు ధర్మంబు నడుపు దానంబు సేయుము వ్రతంబులు సలుపుము సత్యంబు పలుకు మనపాలిదేవతలు మన కభీష్టలాభంబుఁ బొందింపఁగలవారు భవ్యసంతానలాభంబున సంతోషంబువహింపంగలవనిదుఃఖోపశమనభాషణంబులు ధర్మోపదేశగర్భంబులు చారుమధురంబు లగుమాటల నారార్చి కాంచనకలశోదకంబులు కరపల్లవంబున ధరియించి నయనంబులు దుడిచి యగ్గజయానకు ముఖప్రక్షాళనం బాచరించి మందీభూతదుఃఖ యగుట యెఱింగి మంత్రి యంతఃపురంబు వెడలి సముచితవ్యాపారంబులం బ్రవర్తిల్లె నదియా(ది)గ (నాగ) మోక్షప్రకారంబున సభక్తివినయతాత్పర్యంబున. ౩౭

ఉ. ఆధవళాయతాక్షి వసుధామరకోటి భజించు దేవతా
రాధన మాచరించుముని రాజకుపాస్తియొనర్చు మంత్రవి

ద్యాధృతబుద్ధిఁ గాంచుఁగొనియాడును యోగిజనంబువర్ధ
మానాధికభక్తిభావమున నాత్మజసంతతిలబ్ధికామనన్.

గీ. ఎఱుఁగునేనీడనన్నును నెండనన్నుఁ
జెలఁగి ప్రూఁచు నేకర్తవంచిన* లతాంగి
మెట్టి కేశంబులకునైన నీడఁబోదు
తనమనంబుననిగుచుసంతానకాంక్ష. ౩౯

సీ. భక్తితో మాతృకాభవనంబులకు నేగుఁ
గావించు నతిథిసత్కారములను
వాయసంబులకు నిర్వర్తించు దధిబలిఁ
గొలుచు జ్యేష్ఠాదేవి నలఘుమహిమఁ
జదివించుకొనుఁ బుణ్యసంహితావ్రాతంబు
మాలికామాణిక్యములు ధరించుఁ
దన్వంగి గంధాక్షతలు చిరంటుల కిడు
విప్రశ్నికల గౌరవించుఁ దఱచుఁ.
గుమ్మనావంబుకడవలు కొల్లవిడుచు
బాలురకుఁ దియ్యపండులు పంచి యిచ్చుఁ
జెలులుఁదాను వ్రతములు సలుపుచుండుఁ
గామరసనేత్ర పుత్త్రసంతానకాంక్ష. ౪౦

వ. ఇవ్విధంబునఁ బుణ్యోపవాసవ్రతదానధర్మదేవతారాధ
నంబులఁ బ్రతిబంధదోషంబులు వాసిన నామదతీలలా
మంబు మెఱసి ప్రతిమాచంద్రబింబంబు సరసియందు
నుంబోలె గర్భం బావిర్భవించిన. ౪౧

*వించిన-అనియునుండనచ్చును.

సీ. అభ్యంతరస్థాగ్ని యగుశమీలతవోలె
సధిగర్భ యగునబ్ధినిలయవోలె
నంతస్థసద్గంతి యగువియన్నదివోలె
శశికుక్షి యగునస్తసంధ్యవోలె
నాళీనహర్యక్షు యగునద్రిగుహవోలె
వీరధారిణి యగువినతవోలె
నస్తాంతరిత యగునలినాప్తరుచివోలె
సూనృతాభిధ యగుసూక్తివోలె
నాదిమబ్రహ్మసంభవలోకన యగు
కైటభారాతినాభ్యబ్జకమునుబోలె
నధికతాగస్త్య యగుదక్షిణాశవోలెఁ
బ్రథమగర్భంబు ధరియించెఁ బల్లవోష్ఠి. ౪౭
గీ. పలుచఁబాఱెను గండదర్పణయుగంబు
నవమధూకప్రసూనంబు నవమధుకర
మానుగతిఁ జూచుకంబులు నసితమయ్యె
నవతిపూఁబోండ్లసూననాబ్జములతోడ. ౪౮
చ. మనమున కుత్సవంబొనఁగనుం బ్రియుఁ బట్టపుదేవి గర్భశో
భనమునఁ బల్చనై చెలువుపై గొనఁ ముద్దునెమ్మొగంబుతో
ఘనసమయంబునందుఁ బొడకట్టిన చల్లని తూర్పుగాలిచే
ననిచిన కన్నెగేదఁగికి నచ్చినకూరిమిచుట్టమో యనన్.
గీ. గర్భభారాలసాంగియై కంబుకంఠి
చెవి శిరీషప్రసూనంబు చేర్పనోప

దెట్లు ధరియింపఁగానోపు హేమరత్న
కంఠికాహార కేయూరకటకములను. ౪౫

క. ఎలదోఁటతీఁగెయుయ్యల
కలకంఠికిఁ జిన్ననాఁటికతలై తోఁచెం
జెలువకుఁ బాదాంబుజములు
గిలిగింతలుగొలుపుఁ గేళిగిరిగుహలందున్. ౪౬

శా. ఆసారంగవిలోలలోచనను గాఢాలింగనక్రీడల, న్వా
సాగారము కేలితల్పముపయి న్మన్నించి మంత్రీశుఁడ, త్యా
సంగంబొనరించెముద్దుగొనెమృత్స్నాస్వాదనప్రక్రియా,
వ్యాసంగంబునఁగమ్మనై నయదసీయంబైనబింబోష్ఠముల్

క. జలరుహనాభునివక్ష
స్స్థలికౌస్తుభమునను దీప్తిఁదనరెడుమణిరా
ట్పాలికాలంకృతిఁ బోలెం
బొలఁతుక ప్రత్యగ్రగర్భమున నొప్పారెన్. ౪౭

వ. ప్రతిదివసోపచీయమానగర్భనిర్భర యగుచు నయ్యాది
కౌముదీవిలసనంబునుంబోలెఁ బ్రియసఖీవిలోచనచకోరి
కలకుఁ గోరికలు నిండించె వెండియు. ౪౯

చ. బహుదినముల్ మహాసవిపుపట్టపుదేవికి వృద్ధిఁబొందె దు,
స్సహనవగర్భచిహ్నములు చూచి(?) సఖుల్ ప్రియ
మందఁగా ముహు, ర్ముహురనుబద్ధజృంభితసముద్గతవి
హ్వలనేత్రపద్మముల్, జహదజహాత్సమగ్రపురుషాయిత
కేలివిజృంభణంబులున్. ౫౦

గీ. అట్లు ధవునొద్ద మెలఁగుఁ బద్మాయతాక్షి
సముదితంబైన గర్భభారముకతమున
సమ్యగాపీతజలరాశిసామ్యమైన
ప్రావృడారంభనవమేఘపంక్తివోలె. ౫౧

శా. సీమంతోన్నతసంభ్రమంబు వెలయం జేయించె శ్రీయజ్ఞద
త్తామాత్యాగ్రణికన్యపాలకుఁడు వింధ్యాధీశ్వరుండర్థిలి
న్నామంతక్షితిపాలమంత్రులసమానంబైనప్రేమంబునన్
భామాసింధుతరంగరత్నములు పైపైఁ బావడల్దేరఁగన్.

సీ. కమ్మగొజ్జఁగసీటఁ గలయంపిచల్లిరి
మేఁగి మెట్టిరి క్రొత్తమృగమదమున
రంగవల్లులు కప్పురపుముగ్గు వెట్టిరి
కీలించిరొగిఁ మాల్యతోరణములు
తరుణరంభాతరుస్తంభంబు లెత్తిరి
కట్టి రెల్లెడఁ బట్టుకలువడములు
కమలచందనమాలికలును నిర్మించిరి
స్తంభించి రుత్తమదర్పణములు
నాలిఖించిరి గేహకుడ్యములయందు
సర్వతోభద్రమకరికాస్వస్తికములు
పరిజనంబులు రాజాజ్ఞఁ బట్టనమున
యజ్ఞదత్తుని ప్రథమకళ్యాణవేళ. ౫౩

గీ. వేడ్క నృత్యంబు లాడిరి వీథులందుఁ
బాడి రెత్తిలి పికకుహూపంచమమున

బంజళంబున ధవళ ప్రబంధగీత
*కముల నవ్వేళఁ గర్ణాటకమలముఖులు. ౫౪

మ. అదనన్వచ్చిరిసంభ్రమంబుననుబంచారామలీలావతుల్
పదునాల్గాతులయప్సరోంగనలునుంబాలిండ్లపై హారముల్
గదలం బెన్నెఱిసేసకొప్పులపయిం గహ్లారగుచ్ఛంబు లొ
ప్పఁదదీయత్వరగండభాగములఁగంపంబొందఁదాటంకముల్

సీ. పూజకుండలు నిల్పెఁ బువ్వుఁబోఁడి యొకర్తు
శుభవితర్దిక చతుష్కోణములను
జాజాలపాలెలం†సర్వౌషధులు నించి
ప్రోక్షించె నొక్కపద్మాక్షి జలము
కాంతయొక్కతె సన్నెకలుఁ బొత్తరంబును
దోరించె నటశాఖతోడఁగూడఁ
బీఠికంబులు వెట్టె బింబోష్ఠియొక్కతె
మడుఁగుఁబుట్టముగప్పెనడుగుమునుఁగ
రమణి యొక్కతె వింజామరంబు దాల్చెఁ
దరుణి యొక్కతె తాళవృంతంబు పూనె
లలన యొక్కతె పసిఁడిసంబెల ధరించె
నాలవట్టంబుధరియించె నతివయొర్తు. ౫౫

గీ. మంత్రి వేల్పించె గృహ్యోక్తమార్గ మొప్ప
బ్రహ్మపదమునఁ గూర్చుండి బ్రాహ్మణుండు

* కనుమయవ్వలికర్ణాట. మూ. †సర్వౌషధులు చిలికించె నొక్కపద్మాక్షి జలము. మూ.

హోమములు రెండు ఋగ్యజుస్సామవేద
మంత్రపూర్వాది జయాదిహోమంబు తుదగ. ౫౮

మ. చెవికిం గేళివతంసకోత్పలదళశ్రీలై కపోలంబులన్
నవకాలాగరుపత్రరేఖలును మేనం గమ్మకస్తూరి యై
ధనశాంభోరుహనేత్రపై గురిసె నుద్యల్లీలసీమంతవుం
సవనాజ్యాహుతిహోమసంప్రభవచంచద్వహ్నిధూమ
చ్ఛటల్. ౫౯

మ. చెలికత్తెల్ చిఱునవ్వు చెక్కులపయిం జెల్వారవీక్షింపనా
జ్జలు మంత్రంబులు సెప్ప బెగ్గడశరత్సంపూర్ణచంద్రాస్యకు
న్వలిచన్నుంగవమీదనుత్పులకముల్ వర్ధిల్ల గేల్వంచుచు
న్నలినీకంటకమొత్తి చూడలపయిన్ సంధించెసీమంతముల్.

క. కుటిలాలకకును నాసా
పుటరంధ్రములందు మూడుబొట్టులు పిడిచెన్
వటఫలదళరస మధిపతి
కటకరముఖతార్క్ష్య మెసగ గర్భములన్. ౬౦

గీ. మృదులగోధూమనగులతో మేళవించి
వన్నెకుచ్చుల పేరుతో వక్కరించి
పుష్పకుంకుభకంబుతో బొత్తువమ్మ
బడతి పాలిండ్లపై నొప్పు పలికె సేస. ౬౧

గీ. తగవు లిచ్చిరి పుట్టింటితల్లిప్రజలు
పీల్పొలసంగిరి చుట్టాలు వేనవేలు
కట్నమిచ్చె నృపాలుండు కన్నదనియు
బరమహీపాలు రిచ్చిరి పావడములు. ౬౨

సీ. క్ష్మామండలము తురంగమఘట్టమయమయ్యెఁ
గరిమయంబయ్యె దిక్చక్రవాళ
మంబరం బాతపత్త్రావళిమయ మయ్యె
సౌరభమయ మయ్యె మారుతంబు
పరివారమయ మయ్యె బ్రహ్మప్రపంచంబు
జయశబ్దమయ మయ్యె సకలజగము
లాతపత్రవిభూషణాలోకమయ మయ్యె
సంతోషమయ మయ్యె జనులమనసు
వింధ్యపర్వతమేలుఃపృథ్వీశ్వరుండు
దానఁ బట్టంపుదేవియుఁ దగవుగలిగి
సచివునింటికి నేతెంచి సమ్మదమున
నొద్దనుండి యాశోభన మొనరుచుటయు. ౬౩

గీ. జవిలె నరఁ బూలుముడిచినసాధ్వి యొకతె
యుల్లగందంబు పసుపున నూన్చెఁ గదిసి
పసిఁడియుత్తరజందెముల్ పాయఁబట్టె
రాచప్రెగ్గడబ్రహ్మసూత్రమున నగుచు. ౬౪

గీ. దశరథుని వాజపేయంబు ధర్మసూను
రాజసూయంబు ననుసమింపఁ బ్రాఁతియె యని
పట్టనంబును వేళంబుఁ బరిఢవింపఁ
బెట్టె దొడ్డుగ నామెత్త ప్రెగడగారు. ౬౫

వ. అంత. ౬౬

—: సుకుమారుని జననము :—

క. నవమాసంబులు నిండిన
ధవళేక్షణ గాంచె సుతు సుధాకరతారా
రవిసుతధిషణవిధుంతుద(?)
కవులుభికములుగనవమఘటికలు నడువన్. ౬౭

వ. ఇవ్విధంబున సుశీలాదేవి నందనుం గాంచినవార్త యం
తఃపురపరిచారిణి యొకర్తె విన్నవించిన నమృతరసధా
రాపుయం బయినయమ్మాటకు సద్యఃప్రరూఢరోమాం
కురనికరకంటకితగాత్రుండు ను దరస్మితవికసితకపోలముఁ
డలుంకును నై మంత్ర్యాఖండలుండు:— ౬౮

గీ. తాను గట్టినట్టిచీనాంబరంబులుఁ
దాను బెట్టినట్టిమేనితొడవుఁ
బ్రమదమొప్ప నిచ్చెఁ బారితోషికముగ
మంత్రి యంతిపురముమానవతికి. ౬౯

సీ. తలయంపి ధవళనిద్రాకుంభ మిడువారు
రక్షౌభసితరేఖ వ్రాయువారు
గౌరసర్షపరాజి కలయఁ జల్లెడువారు
బలివిధానంబులఁ బరఁగువారు
లవణంబు నింబపల్లవముఁ ద్రిప్పెడువారుఁ
బ్రేము మంచంబుతోఁ బెనఁచువారు
గవలధూపంబు సంఘటియించువారును
మంచిము బెడఁద యోజించువారుఁ

గదిసి దీవించువారును గండతైల
మందుకొనువారుఁ గాయంబు లందువారుఁ
బాడువారును బరిహాస మాడువారు
నైరి శుద్ధాంతసతు లరిష్టాలయమున. ౨౦

సీ. కర్పూరసమిశ్ర గంధసారంబునఁ
జలుచేఁ జప్పట భిత్తిఁ జాము యొకతె
వెలఁగిల్లఁ బెట్టె నుత్పలగంధి యొక్కర్తు
గప్పు గర్భగృహోపాంతభూమి
జ్యేష్ఠాధిదేవత సేవించె నొకయింతి
పసుపుఁబుట్టము గట్టి భక్తిగరిమఁ
బటముపై లిఖియించెఁ బాటలాధర యొర్తు
క్రొత్తలత్తుక శశాంకుని ఖచాంశు
జరఠమేషంబుకంఠదేశమునఁ జుట్టెఁ
బువ్వుదండం శుభగుల నొక్కర్తు పువ్వుఁబోఁడి
యంబుజానన యొకతె నెయ్యభిఘరించె
భుజగనిర్మోక యొకతె నిప్పులఁగమర్చె. ౨౧

ఉ. మంగళరత్నదీపముల మధ్యమునం బురుటింటిపాన్పుపై
సంగజసన్నిభుండు నచివాగ్రణినందనుఁడొప్పె నెంతయు
న్నింగిఁ బ్రదోషవేళ సతినిర్మలతారకచక్రవాళముల్
సంగతిఁ జుట్టునుం గొలువఁ జాలఁగ నొప్పుశశాంకు కైవడిన్. ౨౨

గీ. బాలకుఁడు చంద్రచంద్రికాపాండువయిన
పాన్పుఁబొత్తులపై నొప్పెఁ బవ్వళించి

యమృతవారాశిలోన శేషాహి మీఁదఁ
బవ్వళించిన కౌస్తుభాభరణముఁబోలి. ౨౩

గీ. దానధర్మంబులొనరించి త్యాగమిచ్చెఁ
బ్రసవగేహంబుసొచ్చి భూపాలమంత్రి
యప్డు పావకసంస్పర్శ మాచరించు
ప్రథమతనయముఖేందుబింబంబు చూచె. ౨౪

గీ. పురుషులెల్లంగఁ బుణ్యాహములు గొనరి
నిలయదైవతములఁ గొల్చి నిజసుతునకు
నాగసస్నభుసకు సుశమాగుఁ డనెడి
పేరు వెట్టెఁ బ్రధానబృందారకుండు. ౨౫

గీ. పసుపుఁబుట్టంబుధరియించి పద్మనయన
సుతుని నుత్సంగమునఁదాల్చి చూడనొప్పెఁ
దరణిబింబహారిద్రవార్ధ(ర)ముతోడ
లలితరుచి నొప్పునాకాశలక్ష్మివోలె. ౨౬

గీ. పల్లవాధర మధుఁగ్రైన యొల్లెఁగట్టి
కొంగు మణిహేమకంఠికాకోటిఁ జెనసి
సొబగుఁగాటుకబొట్టుతోఁ జూడనొప్ప
వింతచెలువునఁ బచ్చిబాలెంత మసఁగె. ౨౭

ఉ. అక్షయవర్తితాఖ్యఁబుగరంబు(?)సూత్రలతానిబద్ధముల్
పక్షమునన్ ధరించిసచివప్రియపుత్రుఁడు సొంపునొప్పెను
గ్రక్షితిసంభ్రమోద్ధతిసఁగాంచి వధస్వనితండ్రియా సహా
స్రాక్షునివైరిపేరురమునందు ధరించిన దైత్యుకైవడిన్.

గీ. రత్నవేదికపై మంత్రిరాజసుతుఁడు
తల్లిహృదయంబు దృష్టులు తన్నుఁగొలువ
సకలజనులును బంధులు సంతసింప
జానుచంక్రమణక్రీడ సంచరించె. ౭౯

మ. వలిచన్నుల్ వడఁకాడ వేనలులుగ్రొవ్వాలంగ గారావుదా,
దులు తన్నెమఱ కంతలంతలను(?) వేడ్కల్ మీఱి చూ
డంగఁ దాఁ, గలకాంచీమణికింకిణీకలకలాత్కారంబు
తోరంబు గాఁ, గలహంసంబులఁ బట్టఁ బాఱును వడిం
గత్యావిభాగంబులన్. ౮౦

వ. అంత నాసుకుమారుండు నత్యంతసంతోషవంతు లగు తల్లిదండ్రుల మనోరథంబు ఫలియింప ననుదినప్రవర్ధమానుండై ... వర్ధమానసంపదనురూపంబుగఁ గుమారరత్నంబునకుఁ గ్రమక్రమంబునఁ ... చౌలోపనీతుండై కుమారుం డాచార్యగృహంబున కరిగి. ౮౧

సీ. చదివె వేద మెఱింగెఁ బదము వక్కాణించె
మహనీయదివ్యాగమములు చూచెఁ
దరచె నాదిపురాణధర్మశాస్త్రంబులు
నేర్చె వీణావేణునృత్యకళలు
వాదవశ్యాంజనవదనికాదులు జూద
మాడంగ నెఱిఁగెను మదనశాస్త్ర(?)
సరహస్యముగ నింద్రజాలంబు యంత్రక్రి
యామంత్రతంత్రచిత్రరువుపరచె(?)

గ్రోల్చి యోగంబు సాధించి రుద్రభూమి
సకలశస్త్రాస్త్రసంచయసమితి నేర్చి
నాకళించెను విపులవైద్యక్రమంబు
సంగ్రహించెఁ గవిత్వంబు సచివసుతుఁడు. ౮౨

వ. ఇవ్విధంబున సర్వవిద్యాపరిశ్రమంబునఁ బారీణుం డై యుండునక్కుమారునకు శైశవంబు సరిగడచుటయుఁ బ్రదోషంబునకుఁ జంద్రోదయంబును జలధరంబునకుఁ జక్రవాకంబును బుష్పంబునకు వాసనాప్రకారంబును గమలవనంబునకు సూర్యోదయంబును గంధగజంబునకు దానంబును విజ్ఞానంబునకు మానంబును నసభ్యునకు గేయంబును రాజ్యబలంబునకు నాజ్ఞాబలంబునుం బోలె భువనసమ్మోహనం బైన సౌందర్యంబున కనురూపం బై జవ్వనం బావిర్భవించిన. ౮౩

గీ. బాల్యమునయందుఁ గలుగు సౌభాగ్యరేఖ
నినుమడించిన సౌందర్య మెసక మెసఁగ
సచివతనయుండు తా నొప్పి చారులీలఁ
బౌరజనులకుఁ గన్నులపండు వయ్యె. ౮౪

శా. పంచారామవిలాసినీధవళదృక్ప్రాతీనజాలాయమా
నాంచత్కారము నిర్నిబంధనమనోజ్ఞాకారరేఖా...
పంచాస్త్రుండగు నాకుమారకుఁడు దర్పస్ఫూర్తి నవ్వీటిలో
సంచారంబొనరించెఁ గాంచనమహాసౌధాగ్రభాగంబులన్.

గీ. ఆదిగర్భేశ్వరత్వంబు యౌవనంబుఁ
జక్కఁదనమును నతిసాహసంబుఁ జనవు
నొక్కఁడొక్కండు చాలు దోషోత్కరమున
నన్నియును గూడియున్నవి యతనియందు. ౮౬

సీ. ఒకకొంతప్రొద్దు కందుకకేళి యొనరించుఁ
గంకణంబులఝణత్కార మెసఁగ
నొకకొంతప్రొద్దు వల్లకి నఖాగ్రంబుల
బహురాగములు నేర్పుఁ బ్రస్తరించు
నొకకొంతప్రొద్దు భాండికజనంబు లొనర్చు
పరిహాసగోష్ఠికిఁ బల్లవించు
నొకకొంతప్రొద్దు లోకకథాప్రహేళికా
బిందుమత్యాదులఁ బిచ్చలించుఁ
గొంతప్రొద్దు వినోదించుఁ గొంతలయిన
తోడివేడుకకాండ్రతో మేడమీఁద
విమలచంద్రోదయారంభవేళయందుఁ
బిల్లదీవాటలను మల్లుపెనఁగుటలను. ౮౭

వ. ఇవ్విధంబునఁ దృష్ణావిషవల్లి కాలవాలంబును నింద్రియగుణంబులకు శరణంబును మోహనిద్రకు విభ్రమశయనంబును శాస్త్రదృష్టికిఁ దిమిరోద్గమంబును దోషాశీవిషంబులకు నావాసవల్మీకంబును సుగుణకలహంసంబులకుఁ బ్రావృట్కాలంబును గపటనాటకంబునకుఁ బ్రస్తావనయు ధర్మేందుమండలంబునకు రాహువక్త్రంబు నైనయౌవనారంభంబున. ౮౮

సీ. ఆజానుదీర్ఘబాహార్గళస్తంభుండు
కోమలాళిపనీలకుంతలుండు
కర్ణాంతవిశ్రాంతకమలాయతాక్షుండు
పరిఫుల్లచంపకప్రసవకాంతి
బహుళాష్టమీశశిప్ర సమఫాలతలుండు
కంబుసన్నిభచారుకంధరుండు
పరిపక్వబింబికాపరిపాటలోష్ఠుండు
గంధవారణకుంభకఠినభుజుండు
సచివతనయుండు కుపితధూర్జటిలలాట
చక్షురనలార్చిర్దగ్ధసంప్రభూత
విస్ఫులింగచ్ఛటావలీవేష్టనమునఁ
బసిమి దప్పిన వలరాజుపగిది నొప్పె. ౮౯

సీ. సరిగొన్న వెలిపట్టు జన్నిదంబులతోడ
రత్నాలతారహారము ధరించి
వలిపనీర్కావిదోవతిపైఁ బదార్వన్నె
కళ యైనపసిఁడిమేఖల ఘటించి
గంగమట్టియమీఁదఁ గస్తూరిరసమునఁ
బుండ్రకంబు లలాటమున నమర్చి
కమలకర్ణిక కుండలముల పార్శ్వములందు
లలితంబులగునొంటు లలవరించి
యాత్మవంశపరంపరాయాత మైన
వైదికాచారమార్గంబు వక్కాణించి

యారజము రాచఱికమును నలవరించి
నగరివీథులఁ జరియించుఁ బ్రెగడసుతుఁడు. ౯౦

గీ. సచివనందను కర్ణపాశముల వ్రేలు
కుండలంబులముత్యాలగుళిక లొప్పు
నన్యలోకస్థుఁ డగుశంబరారి కేఁడ్చు
రతిమహాదేవి యశ్రుపూరములువోలె. ౯౧

క. కుసుమాయుధనిభుఁ డగునా
రసికునిపై వ్రాలు సానురాగముతోడన్
బిసరుహనయనలచూపుల
భసలంబులు పూవుఁదోఁటపయి వ్రాలుగతిన్. ౯౨

గీ. భావ మభిరామరూపైకపాతకంబు
యౌవనము దోషములకెల్ల నాస్పదంబు
మన్మథుఁడు కోపి యెటు నియమంబునిలుచు
సుదతులకు వానిఁ గడకంటఁ జూచినపుడు. ౯౩

సీ. హృదయ మువ్విళ్లూర నేకాంతముననుండి
వానిఁ జింతింపని వనజముఖియు
నొకమాఱతనిఁ జూచి యొండొక్క మఱిచూడ
నభిలషింపని విద్రుమాధరియును
కలలోన వానిఁ జిక్కఁగఁ గౌఁగిటను జేర్చి
ముకుళితేక్షణగాని ముద్దియయును
నతనిరూపంబుఁ గుడ్యంబులందు లిఖించి
యందంబుఁ జూడనియంగనయును

చెలులచేతను బ్రోదిరాచిలుకచేత
వానిగుణములు విని కుచద్వంద్వసీమఁ
బాదుకోఁ బులకింపని పైదలియును
బన్నిదము వ్రేసినను లేదు పట్టనమున. ౯౪

సీ. ద్యూతకేళియ వినోదోపాయమయ్యెను
పరదారగమనంబు ప్రౌఢియయ్యె
నాత్మభార్యాపరిత్యాగంబు ధృతియయ్యెఁ
జేలవిహారంబు సేమమయ్యె
గురుతిరస్కారంబు గరిమ మయ్యెను నట
విటకీర్తనంబులు పటిమమయ్యెఁ
బానంబె యధ్యాత్మపరతయయ్యె సమస్త
తరలతాగతియ యుత్సాహమయ్యె
గుణములకు నెల్ల దోషంబు గుణమునయ్యె
నపుడు సుకుమారునకుఁ దద్వయస్యులకును
నాదిగర్భేశ్వరత్వంబు యౌవనంబు
సవురు ధనమును జనవు హేతువులుగాఁగ. ౯౫

గీ. తమ్మమానుషకాలోచితంబులైన
కీర్తనంబుల మై పులకించుకొండ్రు
తా రమర్త్యులుగా మదిఁ దలఁతు రహహ
విత్తమదమత్తచిత్తులై వెట్టిజనులు. ౯౬

సీ. అయ్య నీవు చతుర్భుజావతారుఁడ వన్నఁ
దమభుజాదండపార్శ్వములఁ జూతు

రయ్య నీవు త్రిలోచనావతారుఁడ వన్న
ఫాల మంటుదురు దోఃపల్లవమున
నయ్య నీవు గజాననావతారుఁడ వన్నఁ
గుంభపీఠము లంటికొనఁ దలంతు
రయ్య నీవు చరాచరావతారుఁడ వన్న
నందంబుఁ జూడంగ నభిలషింతు
రవసరం బిచ్చుట యనుగ్రహంబుగాఁగ
మోముఁజూచుట యుపకారముగను బలుకు
మైత్రిగా నప్పు డధికత(?)రార్థముగఁ ద
లంతు,రైశ్వర్యమదబలవంతు లుర్వి. ౯౭

ఉ. సంపద పేరికట్టెఁడిపిశాచము సోఁకినమానవుండు పూ
జింపఁ డభీష్టదేవత భజింపఁడు సజ్జను లైనవారి మ
న్నింపఁడుమిత్రబంధులఁగణింపఁడుధర్మరహస్యముల్ విచా
రింపడు మీ......భరింపఁడహంకరణంబు పెంపునన్.

గీ. ఉద్ధతుం డయి సుకుమారుఁ డుండలేక
పీటఁ జక్క నిజవరాలి వెదకి వెదకి
వలపు పుట్టించి సంకేతములకుఁ దార్చి
చలుపురతికేలి బహుళపక్షంబు రేలు. ౯౯

గీ. పద్మనాభుండు మదనగోపాలమూర్తి
ఘోషమున నెట్లు వలపించె గొల్లసతుల
నెట్టుకొని యట్లు వింధ్యాద్రిపట్టనమునఁ
బరపురంధ్రుల వలపించు బ్రాహ్మణుండు. ౧౦౦

సీ. యమునానదీసైకతమున జాలరికన్య
చనుదోయి నంటఁడే శక్తిసుతుఁడు
నందవ్రజంబులో నలిననాభుం డెట్లు
విహరించెఁ బదియాఱువేలసతుల
దేవదారువనంబులో విరూపాక్షుండు
మునిభామినుల నెట్లు మోసపుచ్చెఁ
గౌశ్యారాకోయని కోడియై యెలుఁగించి
యమరనాయకుఁ డె ట్లహల్యఁగలసె
మొలకచన్నులపాయంపుముద్దుఁగూఁతుఁ
బట్టుకొనె నెట్లు పైకొని పద్మభవుఁడు
చందురుం డెట్లు వొందె నాచార్యులేమ
ననుచు విప్రుండు రమియించు నన్యసతుల. ౧౦౧

సీ. సంధ్యాభివందనశ్రద్ధ యుద్వాసించె
గాయత్రి దవ్వులఁ గట్టిపెట్టె
నగ్నిహోత్రము మీఁదియాన నుత్పాటించె
నఘమర్షణస్నాన మరసిమాంపె
నిహపరసామగ్రి నీయఁజాలెడునట్టి
విధిదేవతార్చన వీటిఁబుచ్చె
వేదపాఠము మానె వివిధసత్కార్యాది
సత్కాలాపంబులు జాఱవిడిచెఁ
దనకు మరగినవారసుందరవనితల
నిరతసల్లాపసంభోగనిపుణతాసు

ఖానురాగనిమగ్నుఁడై నిత్యకర్మ
మై తనర్చెను సుకుమారధరణిసురుఁడు (?) ౧౦౨

వ. ఇవ్విధంబునఁ గుమారుండు విహరింపంజూచి. ౧౦౩

క. ప్రేమమునఁ గూర్చి సుతునకు
వేమఱు సద్బుద్ధి చెప్ప వినమికి వగచున్
సామగ్ర్యదుర్గుణాళి క
దా మధురత యొసఁగు విషమమగుచలమునకున్.

గీ. జవ్వనమునను సదుపదేశములు గావు
తిల - - - లంబు తెలుఁగుదోఁప
శంబరారాతిపుష్పాస్త్రసంప్రహార
జర్జరీభూత మగుమనస్సంపుటమున. ౧౦౫

వ. తండ్రి గుహూపదేశం బఖిలమలప్రక్షాళనక్షమం బైన తీర్థస్నానంబు జరామరణవైకల్యంబు లేని వార్ధకంబు, మేదోభారంబు లేని గౌరవంబు, సువర్ణరచన లేని కర్ణాభరణంబు, నుద్వేగంబు లేని ప్రజాగరంబు. ఇది యభవ్యులకు సలిలంబునుం బోలెఁ గర్ణస్థితంబై యుపద్రవంబునాపాదించు. నీవిటువట్టి నెట్టుకొని పెద్దలమాట వినుము, వింటేని ధూర్తులు నిన్నుఁ బ్రశంసింపలేరు, కుటిలులు నిన్నలమరింపలేరు, వంచకులు నిన్ను వంచింపలేరు, పల్లవులు నిన్ను వలపింపలేరు, మదంబు నిన్నుఁ గదల్పలేదు, విషయంబు నిన్నునాశ్లేషింపలేదు, వినుమనూచానాచారంబును, నాముష్యాయణంబును, నా

మేధితామ్నాయంబును, నధీతాశేషశాస్త్రంబును,నలింగవృత్తియు, ననపకీర్ణంబు, ననభ్యుదితంబును, ననభిస్తుతంబును, నైన యార్యవరవంశంబునం బ్రభవించినాఁడవు మూఢుండవై యనుష్ఠానబంధంబులగువిషయోపభోగంబులయందును సుఖబుద్ధి యారోపించెదవు. నీయట్టిదుర్బుద్ధిశీలురుగదా నిస్త్రింశంబుఁ జూచి కువలయమాల యని యుఁ గృష్ణసర్పంబు వీక్షించి కాలాగురుధూమరేఖ యనియును నంగారంబు దర్శించి బంగారం బనియు ను భ్రాంతిఁ బొందుదురు. దుందుమారసముండు, మాంధాతృసహాయసనాభాగసన్నిభుండు, వింధ్యాచలపతి, హేమాంగదుండు మనల గురుస్థానంబుగా మన్నించుచున్నవాఁడు. మనవంశంబునకు నీవొక్కండవ సంతానబీజంబ వింతయు నెఱింగి బుద్ధిమంతుండవై మమ్ము నుద్ధరింపవలనదా యని పలికి మంత్రి కన్నీరు దొరఁగ ముహూర్తమాత్రం బూరకుండె సుశీలాదేవియు. ౧౦౮

సీ. రవలయుంగరముల రత్నాంకురము లొత్తఁ
గేలమ్మి చెక్కులఁ గీలుకొల్పి
మొకరితుమ్మెద మూఁతిముట్ట నోడెడివేఁడి
నిశ్వాసపవనంబు నివ్వటిలఁగ
నాకర్ణదీర్ఘంబు లగునేత్రాలుఁగన్నులఁ
బరిపాటలచ్ఛాయ పల్లవింపఁ

గంఠగోళంబు గద్గదికానుబద్ధమై
బాష్పభారంబు నిబ్బరము గాఁగఁ
బక్ష్మముల జాఱి గండదర్పణము లొరసి
వ్రాలి పాలిండ్లపై నశ్రువాఃకణములు
హారలతలకు నాతిథ్య మాచరింప
నుబ్బతిల నేడ్చె నత్తఱిఁ గువలయాక్షి. ౧౦౨

వ. ఇవ్విధంబునఁ దల్లియుఁ గండ్రియుఁ దనకు హితోప దేశంబుచేసి తన సౌమనస్య సౌముఖ్యంబులతోఁ దగిన ప్రత్యుత్తరం బీయమి నిర్వేదించుట యెఱింగి. ౧౦౩

సీ. ధర్మశాస్త్రాభ్యాసతాత్పర్యమున నైన
సంస్కార మె ట్లారుసౌరుపడియె
నిరుపాధినిస్సీమనిర్నిబంధనవృత్తి
గలమహాప్రతిభ యేకాటఁ గలసెఁ
బంచేంద్రియోపాయపానభూతము లైన
వినయంబు లేప్రయోజనముఁదీర్చె
నవయౌవనాంకురోన్నతవంశపదమైన
శ్రుతిపై భవము లేమిహితవుచేసెఁ
జిన్నవయసున గురుల వీక్షించినట్టి
పుణ్యవాసన నేల గోల్పోయె మనసు
కటకటా! నందనుండ వొక్కఁడవు నీవు
గురుల నేడ్పించుచున్నావు ఘోరముగను. ౧౦౪

వ. (అనినఁ దల్లిదండ్రుల)కుం బ్రణామంబుచేసి యింత

నుండి మీయాజ్ఞ శిరసున ధరియించి బుద్ధిమంతుండనై యుండెద మీరు వగవకుండుం డని పలికి సముచిత ప్రకారంబున వీడుకొనియె ననిన నటమీఁదివృత్తాంతం బెట్టి దని యడిగిన. ౧౧౦

మ. వరశైవైకవిధానపాత్ర కవితావ్యాపారపారంగతా
స్థిరలక్ష్మీనవశారదోదయ దయాధీనాయతాలోక లో
కరమాపాదన పాదపద్మవినతక్ష్మాపాలసంశీల శీ
లరతిప్రస్ఫుటశాంత శాంతనవకల్పోద్వీర వీరాగ్రణీ

క. ధీమత్కవితావిస్తర
ధామాయితనిరుపమానదానాంబుదహృ
ద్భీమ జయోత్కలసీమా
రామామన్మథవిశేషరాజితమూర్తీ! ౧౧౨

పృథ్వి. లింగార్చనాయామిలీలావతారా
గంగాంబుసుస్వచ్ఛకావ్యైకజాలా
సంగీతసాహిత్యసౌహిత్యలోలా
శృంగారసద్భక్తసేవానుహేలా. ౧౧౩

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామా త్యపుత్ర సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయ ప్రణీతం బయిన శివరాత్రిమాహాత్మ్యంబునందు ద్వితీయాశ్వాసము.

---

శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

## (సుకుమారచరిత్రము)

### తృతీయాశ్వాసము.

—ooసosoo—

క. శ్రీదోరంతర వేద
ప్రోదితభాషావిశేషభాసురకీర్తి
శ్రీదార్ఢ్య వివిధపూజా
మోదితగిరిదుహితృకాంత ముమ్మయశాంతా! ౧

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు తల్లిదండ్రుల నూరార్చి వెడలి సుకుమారుండు నిజాంతర్గతంబున. ౨

గీ. హోమె నుపదేశకాలంబు పూర్వముననె
కడచె ధైర్యంబు జరరవిక్రాంత మయ్యె
శీలసంపత్తి యింక నేమి సేయువాఁడ
భామినీసక్తి మన్మథుబారిఁ బడితి. ౩

శా. పంతంబోడదుధర్మముందగవునుంబాడింగులంబున్విచా
రింతు న్వేదపురాణశాస్త్రమతపారీణుండఁ గా నెట్లు ౪

ల్పాంతద్వాదశభానుమత్కిరణదాహక్రూరకామవ్యథా
సంతాపజ్వరవేదనాభరమునం జాకుంట సిద్ధించినన్. ౪

సీ. చాండాలుతోఁ బుల్కసత్వంబు గైకొను
బ్రహ్మహత్య యొనర్చు బ్రాహ్మణుండు
క్రిమియై పతంగమై కీటమై జన్మించు
నాసవం బాని భూమీసురుండు
క్రవ్యాదసత్త్వసర్గమున నుద్భవమందు
విప్రుఁ డాచార్యునివెలఁదిఁ గవిసి
శ్యామచారుండు పిశాచమా బ్రాడబుం
డన్యునివిత్తంబు నపహరించి
యయిన నేమిగా వీనిలో నన్నిటికిని
సుఖము దుఃఖంబుఁ జర్చించి చూచినప్పు
డెల్లసంసారులకుఁ గుందు హెచ్చు...
లేకయుండుట గందుమో లేదొ జగతి. ౫

గీ. వామదేవుండు శుకుఁడుఁ గేవలముదక్క
ముక్తులెవ్వరు వింటిమే ముజ్జగమున
జంతువులకెల్ల సరియ సంసారయాత్ర
విధినిషేధంబులకుఁ జొప్పు వెదకనేల. ౬

శా. ఆతంకంబున కేమికారణముబ్రాహ్మ్యంబింతయుంజూచిరే
తాత ల్గట్టినచెర్వులే శ్రుతులు బోధప్రక్రియల్ స్వల్పమే
చేతోజాతు నుపాశ్రయించెదఁబరస్త్రీలన్వినోదించెదన్
మాతంగీపరమేశ్వరింగొలిచెద న్మద్యంబు సేవించెదన్.

12

గీ. అష్టమావతారంబున నాదిపురుషుఁ
డచ్యుతుఁడు విశ్వకర్త యనాదినిధనుఁ
డర్జునుండును దాను నేకాంతగోష్ఠి
విశ్వమును నెఱుఁగ మొ...నిధిగా ౮
సంచెవింతము విధమతనిన్ భావించెఁ గాదె (?)

మ. బహువేదాంతమునందు సాధితమహాబ్రహ్మోహమం చా
డుదుర్, మహిం మోహాంధులుగొంద ఱేనియటె బ్రహ్మం
బెట్టు దా రెట్టిరో, యహాహ బ్రహ్మమువారయే నలుక
శయ్యం దెల్లిని ద్రింతురో, జహదుత్సర్గముగాఁగఁ జేయు
దురో విష్ణుమూర్తి నిర్లోకమున్. ౯

సీ. కల్పద్రుమంబుతోఁ గామధేనువుతోడ
నమృతాబ్ధినవతార మయ్యె నెద్ది
బృందారవనమధ్యమందారతరులలో
హాలపాణి కెద్ది ప్రత్యక్ష మయ్యెఁ
ద్రిపురాంతకుని యర్ధదేహంబునకు నెద్ది
మదనసంపుల్లసంపత్తి యయ్యె
నవసుధారూపమై పవనభుగ్భువనాధి
పతికెద్ది ప్రాణంబుప్రాణ మయ్యె
నట్టి భవభేషజము నాసవామృతంబుఁ
గన్నుఁగానక శపియించెఁ గాక యొకఁడు
తత్సమానము లగుపదార్థములు గలవె
భూతభావిభవత్కాలముల ధరిత్రి. ౧౦

వ. అని. ౧౧

సీ. కర్పూరరజములోఁ గలిపి కేతకిధూళి
నఖిలాంగకముల నభ్యంగమాడి
జలజనాళీతంతుసందానితములైన
యజ్ఞోపవీతంబు లఱుతఁ దాల్చి
వారాంగనాస్తనహారవిభూషల
నతిమాల్యముగఁ జే నలవరించి
కస్తూరికామిశ్రగంధసారంబున
నలికంబునఁ ద్రిపుండ్ర మనువుపఱిచి
చంద్రికావేళఁ బరిపాండుసౌధవీథి
శక్తిఁబూజించి దేవీప్రసాదమధువు
పుచ్చుకొని విప్రుఁ డాకంఠపూరితముగ
వెలఁదులును దాను నప్పుడు వినిమయముల. ౧౨

క. వనితల కంగప్రక్షా
ళన మత్తివిఘూర్ణనంబు లజ్జావిగమం
బనవస్థితి మధుపానం
బునకు సురతమునకు సదృశములు వక్రంబుల్. ౧౩

గీ. త్రినరకాస్వాదభవమదోద్రేకలహరి
ధరణిదేవుఁ డాయోజ మత్తా వహించి
యారణాలు పఠింపంగ నాలకించి
శంబరారాతి రతిచేయు చఱచి నవ్వ. ౧౪

సీ. ఇంటనున్నాఁడొ వాఁ డెచ్చోటనున్నాఁడొ
యొంటియో యెంద తేనున్న వారొ

మిన్నకున్నాఁడో యేమేఁ బల్కుచున్నాఁడో
నిద్రించినాఁడో కన్తెఱచినాఁడో
యాడుచునున్నాఁడో - - - - గ
ర్వించియున్నాఁడో శోకించినాఁడో
- - - - - - - యుత్సేకించి యు
ల్లాసించినాఁడో కలంగినాఁడో
యుత్సవమొ వైభవమొ లేమియో కలిమిరేయు
పగలో రాత్రియొ యెఱుఁగఁ డాబ్రాహ్మణుండు
నవమధూకప్రసూనసంభవపుమధువు
దలము దప్పంగఁ ద్రావి మత్తావహించి. ౧౫

క. సుకుమారుఁ డిట్లు నానా
ప్రకరంబుల వీటిలోనఁ బడుచై తిరుగన్
సకలజనులు మొఱవెట్టిరి
యొకనాఁ డత్యాగ్రహమున నుర్వీశుసభన్. ౧౬

క. దేవరప్రతినిధిఁగా సం
సేవింతుము యజ్ఞదత్తు సిద్ధమ యతనిన్
భావింతుము తత్తనయుని
యావనసంప్రాప్తి లేనియటము న్నెల్లన్. ౧౭

వ. అవధరింపుము సుకుమారనామధేయుం డైనమంత్రినం
దనుండు సౌందర్యవంతుండును గామశాస్త్రకళావిధి
జ్ఞుండును నై జారచోరవిటధూర్తవర్గంబులంగూడి వేదు
కకాఁడై పుణ్యస్త్రీల నిలువకునఁ జెఱుచుచున్నవాఁ

డతని వారింపను నారీజనంబుల శిక్షింపను సమర్థులము గాక యున్నార మద్దురాత్మకుని యన్యాయసదృశం బైనదండంబువలన దండింపనది యని విన్నవించిన మహీపాలుం డతని రప్పించి వాగ్దండనంబున దండించి పురంబును దేశంబును వెడల నడిపించిన రాజావమానితుం డై యప్పాపి కీ(క)ట దేశంబునకుం బోయి యందుఁ గొన్ని దినంబు లుండి హూణమండలంబునకు నేతెంచువాఁడు కాంతారమధ్యంబున నతిక్షుత్పిపాసాపరవశుం డై తనలోన నిట్లు వితర్కించుచుండె. ౧౮

చ. అరుణగభ స్తిబింబముదయాద్రిపయింగనుపట్టగిన్నెలోఁ
బెరుఁగునువంటకంబువడపిందియలుంగుడువంగఁబెట్టు ని
ర్భరకరుణాధురీణయగుప్రాణముప్రాణముతల్లి యున్న దే
హారహార యెవ్వరింకఁగడుపారసిపెట్టెదరీప్సితాన్నముల్.

వ. అని తనలోనం దలపోయుచుం జనిచని ముందట. ౨౦

సీ. స్ఫటికరత్నగృహంబు సర్వంసహాకాంత
 కభిధాంతరంబు దుగ్ధాంబునిధికి
మణిదర్పణము నభోమణిమార్గలక్ష్మికిఁ
 జంద్రాతపమునకు జన్మభూమి
యర్ధేందుమకుటాట్టహాసంబునకు జోడు
 పౌలస్త్యగిరికి సబ్రహ్మచారి
ప్రతిబింబ మభ్రము ప్రభువారణమునకు
 ననుఁగుఁజుట్టము శారదాభ్రములకుఁ

గమరతిమినక్రవిక్రమక్రమవిహార
చటులతరవీచికాఘటాసమదరూఢ
హంసకులసన్నినాదసంవ్యాప్తదిగ్వి
భాగ మీక్షించె నతఁడు తడాగ మెదుర. ౨౧

మ. వసుధానిర్జరుఁడు న్మహాసరసిలోఁ బార్శ్వములం దేలెఁ ద్రా
వె సుధాసన్నిభమైనవారిఁ దటపృథ్వీజావళిచ్ఛాయలో
వసియించెన్ లహరీసమీరముల నధ్వశ్రాంతిపోఁ గారిచె
న్బిసకాండంబులు మేనఁ గూర్చెఁ జలువ ల్నిర్మోకసం
కాశముల్. ౨౨

క. కరశీకరార్ద్రపుష్కర
కరుఁడై యాతండు గంధకరిరాజు క్రియం
బరిషేకాంతరమునఁ దా
సరసిరుహాకరము వెడలి చాలఁగ నొప్పెన్. ౨౩

సీ. వైడూర్యమణిశిలాస్వచ్ఛోదకస్నానఁ
గౌతుకం బొనరించెఁ గన్నుఁగవకు
శిశిరసంస్పర్శవీచీమారుతముగాన
నంగకంబులకు నింపావహించెఁ
గమలకేసరరేణుగంధోల్బణముగాన
ఘ్రాణేంద్రియమునకుఁ బ్రమద మొసఁగెఁ
గలహంసకులకలకలకులాయముగాన
శ్రుతిసంపుటములకు సుఖమునిచ్చె
- - - సలిలంబు నహ్లాదమునను జేసె
నాలుకకు నప్పు డవనిబృందారకునకు

సైకతారూఢ జలమానుషీకదంబ
కాంక్షితార్కమయూఖంబుకమలవనము. ౧౪

క. కొలనిదరి వటము నీడన్
శిలతల్పమునందుఁ గొంతసేపు శయించెం
జెలువ మగువలిపెదుప్పటి
తలగడఁగాఁ జేసి సచివతనయుం డొలఁతన్. ౧౫

గీ. బహులపక్షపాకదంబములలోన
బ్రభవ మొందిన యంధకారంబువోని
కొలనిదరి కాననంబులోఁ గొంతప్రొద్దు
నలవువాయంగ నిద్రించె యాజ్ఞదత్తి. ౧౬

గీ. దప్పిదీఱంగ మధురకాండంబుగోలి
కడుపునిండంగఁ దూఁడుఁదీఁగలుభుజించి
యెండ వాలాగునందాఁక నిండుకొలని
తీరమున మఱ్ఱినీడ నిద్రించె నతఁడు. ౧౭

చ. అపుడువిలంబమానమయియంబరకోణతటాంతరంబునం
దపనునిమండలంబు బెడిదంబగు వేఁడిమినొయ్యవీడ్కొనెం
గపిలములై మయూఖములు కార్తికమాసకలాపిపింఛమై
త్రపునల తాళలాటునము దాయము చాయఁ దిరస్కరింపఁగన్

గీ. అంతలో నిద్ర మేల్కాంచి యవనిసురుఁడు
జిగమిషాబుద్ధి నీక్షించెఁ జిత్రభాను
నభినవోన్మేషకుటిలజిహ్వాప్రకార
లోలతారకకేకరాలోకనమున. ౧౯

శా. కాంతారాంతరభూమిచెంత శబరగ్రామంబు పద్మాకర
ప్రాంతక్షోణీతలంబునంగలుగ సంభావించె విప్రుం డదన్
దంతిస్కంధకపోలకుంభపలలాదక్రూరకాలేయకీ
సంతానస్ఫుటకంఠఘుర్ఘురతరద్రాఘిష్ఠనాదంబులన్. ౩౦

సీ. ఆదికాలమున మాయావిలాసిని యైన
మురదైత్యదమనునిమూర్తివోలె
ధరణీతలంబునఁ జరియింపనేర్చిన
పురుహూతమణిశిలాపుత్రివోలెఁ
గామినీరూపంబుఁ గైకొన్న శంబరా
రాతికాలాయసాస్త్రంబువోలె
వేడ్కమైమానుషీవిగ్రహంబు ధరించి
విహరించుతొలుకారువేళవోలె
నంధతామిస్రమును నవిద్యయునుబోలె
భువనమోహనరూపవైభవములోలయ
లీలనేతెంచె నొక్కచండాలకన్య
కొలనఁ జిఱుబంతిపసుపాడఁ జెలియుఁదాను. ౩౧

శా. ఆచండాలకులప్రసూతయగు-కన్యం గన్యకారత్నముం
జూచె న్దవ్వుల యాజ్ఞదత్తి విపినక్షోణీవిభాగంబునన్
వాచాగోచరసౌకుమార్యనవలావణ్యాన్వితం బుష్పనా
రాచుండిక్షుశరాసనంబుఘనదోర్దండంబునంగూర్పఁగన్.

ఉ. యోగసమాధితత్పరతనున్న విధంబునఁ బాసినట్లు మా
ర్ఛాగమమీఱితాత్ముఁడగుచాకృతినిశ్చలదేహయష్టియై

సోగకనుంగొనల్ దొరుఁగఁ జూపుల కిక్కలుగాఁగ నత్రతి
న్నాగరసాతిరేకమున బ్రాహ్మణుఁ డాదటఁ జూచె మాలెతన్.

సీ. అప్సరస్త్రీవోలె నకులయై యారయ యీ
పైదలి కన్నులపండు వయ్యెఁ
జారుయౌవనరూపసంపన్నయై మోక్ష
వనరేఖయును బోలెఁ బెనఁచె వేడ్కఁ
బొలఁతి ప్రావృడ్వేళవోలె నళివినీల
ఘనవేణియై యిది గగము మెఱసె
నిభరాజనిభయాన యిది శరత్తువోలెఁ
బుండరీకాక్షియై పొలుపుమిగిలె
ముట్టరానిది యైనట్టిమూర్తి వోలెఁ
జిత్తరువువోలె దృష్టికచ్చెరు వొనర్చె
మెలఁత మధుమాసకుసుమసమృద్ధివోలె
జాతివిరహితయయ్యు సంప్రీతినొసఁగె. 34

గీ. దీనిఁ గల్పించె నజుఁ డభిధ్యానమునను
నాతి మును ముట్టరాకుండ నంత్యజాతి
ముట్టుటయ కల్గెనేని యిమ్ముదిత మేను
గందకుండునె పుష్పంబుకంటె మృదువు. 35

వ. అని విస్మృతనిమేషంబు గీలించి ముకుళితపక్ష్మాంచలంబును జిహ్మేతరతరళతారోదరంబును నగువీక్షణంబున నవ్వెలివాడవ్రీడావతి నీక్షించుచు నవ్విప్రుండు మదనశరశలాకాశంకు పంకలితహృదయుండై స్తంభితుని

భంగి విలిఖితునిచందంబున నత్యుగ్రునిపగిది నియతు నిలాగున మూర్ఛితునిప్రకారంబునం దన్నుఁదా నెఱుంగక నివ్వెఱపడి నిశ్చలాంగుండై యుండె నమ్మచ్చెకంటియు నలవోకవోలె నతిస్వచ్ఛసౌభాగ్యచ్ఛాయావినిర్భర్త్సితమత్స్యకేతనుం డగునాబ్రాహ్మణుం గనుంగొని నిజాంతరంగంబును. ౩౬

గీ. విప్రవేషంబుఁ దాల్చినవిష్ణుఁ డొక్కొ
బ్రాహ్మణుండైనశంబరారాతి యొక్కొ
బాడబాన్వయరూపసంప్రభవుఁ డైన
చందురుం డొక్కొ యితఁ డతిస్వచ్ఛమూర్తి. ౩౭

వ. అని యంతంతం జేరవచ్చి యయ్యంత్యజాతిసీమంతిని యశేషజనపూజనీయులు బ్రాహ్మణు లని తమకులంబు పెద్దలవలన వినుటంజేసి యుఁ దా నెందే నొక్కపూర్వజన్మకృతపుణ్యసంస్కారవిశేషంబుననో బాల్యంబు నాఁటనుండియు రూపంబు వినయంబు దాక్షిణ్యంబు మధురాలాపకౌశలంబు నిస్సంగత ప్రశాంతమహానుభావంబు శుచిత్వంబు గౌరవంబు సద్భావంబు గుణంబులు నైసర్గికంబు లయి యుండుటనో భర్గఫాలనయనకృశానుజ్వాలాజాలహేలాచుళుకితావయవుండు గాని కుసుమకోదండుండునుంబోలెఁ గన్నులపండువై తప్తకాంచనవర్ణంబును గోరోచనాగౌరంబును జాంపేయకుసుమ కేసరరేణుత్రసరేణు విసరప్రసంగంబును నగు

దేహప్రభాప్రవాహంబునఁగహనషండం బశేషంబును వెలిం
గించువాని నుద్భిన్ననవశ్మశ్రు నభినవయౌవనోద్భాసితు
షోడశవర్షదేశీయు నాదిగర్భేశ్వరు నమాత్యనందను
సుకుమారుం గుమారసన్నిభుఁ దప్పక చూచి భయ
సంభ్రమడోలాయమానదంతతాటంకవలయం బగున
ట్లుగా నిబ్బరంపుగుబ్బచన్నుల బిబ్బోకంబు బాహు
మూలకూలంకషంబై యీషద్విలోకనీయంబుగఁ గేలు
దోయి సేవాంజలిపుటంబులలాటంబునఁ గీలించి యయ్య
గారికి నమస్కారం బని యధరకిసలయంబునకు దశ
నరత్నాంకురజ్యోత్స్న కుసుమస్తబకంబుగా సహకారప
ల్లవాస్వాదకషాయకంఠకలకంఠకామినీకోమలకుహూ
కారకోలాహలకరంభిత పంచమరాగప్రపంచంబునకు
మించుఁ జూపు కంఠస్వరంబునం బలికిన. ౩౮

గీ. వెలఁది మాలెతగాన దీవింపకయును
నొప్పిడిదిగాన నాదరకయుండకయును
ధరణిదేవుండు గైకొనె దాని మ్రొక్కు
గేలుఁదామరఁ దిర్యగాందోళనమున. ౩౯

ఉ. శంబరవైరిసన్నిభునిఁ జారుతరోజ్జ్వలమూర్తి విప్రర
త్నంబు మహాప్రధానుప్రియనందను నిన్నుకుమారుఁ జూచి ప్రే
మంబువహించియుంగొమరుమాలెతగన్నులనవ్వఁ జేరఁగా
నంబళి నంబళీయళుకు సంకడికిందలమంచుఁ బల్కుచున్.

గీ. బ్రాహ్మణుఁడుగాన లజ్జింపఁ బ్రాప్తిలేక
బాల ప్రౌఢయువోలెఁ దప్పకయ చూచి

చాటువడి యుండుమయ్య యీసరసిలోన
నుదకమాడెదఁగాక పిన్నదియునేను. ౮౧

క. అని పలుకుచుఁ గొలనికి డిగఁ
జని మాలప్రమద దాను సఖియు నొనర్చె
నన కేళి తరంగ లురు
స్తనభారాస్ఫాలనమున జర్జరములుగాన్. ౮౨

చ. పడఁతి పసిండిడాలు గనుపట్టు హరిద్రముఁ దీరపంకముం
దొడసి సరోవరాంబువునఁ దోఁగి పయోనిధితీరభూమికి
న్వెడలి ధరాసురస్వనకు నేత్రమహోత్సవ మయ్యె
నప్పుడ, వ్పుడ కలశాబ్ధిమధ్యమునఁ బుట్టినయాదిమ
లక్ష్మియోయనన్. ౮౩

ఉ. ఆకలకంఠయొయ్యఁదడియార్చు నెడన్ జఘనాంతికంబులై
కేకికలాపలీల నణకించి మధువ్రతమాలికాకృతిం
గైకొని యింద్రనీలమణిఖండవిలాసమలిమ్లుచంబులై
చీఁకటిగొల్పె బ్రాహ్మణునిచిత్తము పెన్నెఱిసోగవెండ్రుకల్.

గీ. చికురసంతతి నీరార్చి చెలువ తుఱిమె
సేసకొప్పాక - - - -
చన్నుఁగవసొంపు కటిదేశముల మెఱుఁగు
బ్రాహ్మణునియాత్మఁ బల్లవింపఁగఁ జేయు. ౮౫

గీ. దంతతాటంక చక్రమధ్యంబునందు
బాల కీలించెఁ గంకేళిపల్లవంబు

బాడబునినేయఁదలఁచుశంబరరిపునకుఁ
బ్రథమ మదియ నమస్కారబాణమయ్యె. ౮౬

గీ. పూనెఁ గుచముల వెలివాడపువ్వుఁబోణి
విప్పుగలయట్టి బండిగుర్వెందసరముఁ
బ్రథమరాగరసోదయరక్తమైన
సచివనందనుహృదయజసంగరమున. ౮౭

వ. అప్పుడు సుకుమారుండు నిజాంతర్గతంబున. ౮౮

సీ. ఏలచేయుండు శేషేంద్రియంబులు నాల్గు
నలినగర్భుఁడు లోచనములుగాఁగ
నెట్టుగల్గె విధాత కీరూపనిర్మాణ
పరిమాణము లకోటిపరిమితంబు
లజుఁడు దీని సృజించి యాత్మ నువ్విళ్లూర
కెట్లుండుఁ గూఁతుమోహించినాఁడు
కల్పింపఁబోలు శృంగారసర్గంబున
దీని వాక్పతి యున్నతి ఫలియించె
దీనినిఖిలావయవములు తీర్చి తీర్చి
చేయునపుడు ప్రయాసంబుఁజెందుటయును
నొయ్యనొయ్యన బ్రహ్మ నిట్టూర్పువుచ్చె
నదిసుమీ పుష్పసమయమందానిలంబు. ౮౯

వ. అని విచారించుచు విప్రుండు చండాలకులకన్యకామణీ దుర్లభంబగు సౌభాగ్యంబునకు నద్భుతం బందుచు దానితో సంభాషింపఁ గోరి చేరువ నిలిచె ననంగమ కన్యకారత్నంబును నతని కిట్లనియె. ౯౦

క. ఎందుండి యరుగుదెంచితి
రెం దరిగెద రిచట నునికి కేమికతంబో
కందర్పరూపరేఖా
సౌందర్యవిలాసవిభవసర్వస్వనిధీ. ౫౧

వ. నిన్నుం జూచి సుఖామృతంబున మునింగినచందంబున నతి
- - - సముద్రంబునం దేలినవిధంబున సర్వానందం
బుల కుపరిభాగంబున వర్తించుకరణి సకలమనోరథం
బులకు సంకేతంబై నలాగున నాహృదయంబు నిర్వృ
తింబొందియున్నయది. ౫౨

ఉ. క్రొన్నపవింటిజోదు నలకూబరు నైషధునిం జయంతు
నిం, బున్నమనాఁటిచందురునిఁ బోలినవాఁడవు రూప
సంపదన్, నిన్నొకపత్రుఁగాఁ బరిగణింపఁగవచ్చునె కల్ల
గాదు మా, యన్నలయాస చూడు పులకాంకురముత్
కులచెంగుచంబులన్. ౫౩

గీ. అవనినుర చింతకాయల కాజ్ఞగాక
యరసిచూడంగ గ్రుక్కిళ్ళ కాజ్ఞ గలదె
యంటరాకున్న నేమి యంతంత నిలిచి
చిత్తమలరంగ నిన్ను వీక్షింపరాదె. ౫౪

సీ. కమలినీపత్రపుటములఁ గాసారోద
కముఁదెచ్చి పాదపద్మములు గడుగఁ
జిలుకముట్టనిఫలంబులు గోసికొనివచ్చి
పరికించి యారగింపంగఁ బెట్టఁ

గాంతారకర్పూరకదళికానళముల
సరసరీతులను వీజన మొనర్ప
నర్ఘ్యఖేదమువో వ హస్తద్వయంబున
నూరుకాండము లొత్తి యుపచరింప
వేడ్కయయ్యెడు వినయంబువిస్తరిల్ల
భక్తిగొనఁగఁ బ్రమోదంబు తరమేదు
నీకు విప్రోత్తమునకు నీనెలవులందుఁ
జెడ్డదుర్జాతి యది నన్నుఁ జెఱిచెఁగాని. ౫౫

క. ఇది హూణమండలం బ
వ్వది నున్నది చెంచుపల్లె వనమధ్యమునన్
మదననిభ యీపుళిందా
స్పదంబు వెలివాడ - - - - - ౫౬

తాళవృత్తము. కనుఁగొనవలయును దాదవ్వుల నెడగలుగ
నిలిచి యైనను మాయిండ్లన్, వనమధ్యంబున విప్రోత్తమ
వెలివాడవనితలకు నేత్రోత్సవమై, యనిభృతపరభృతన
ఖరేఖాకో - - - - సహకారద్రుమశాఖా, ఘనఫల
రసధారామృతపానోత్కంఠవిస్మృతానననటుకంబున్.

క. పాణసివారము కమ్మని
ప్రాణము నెఱజాణదేవరా వినవలదా
వీణావాద్యముఁ బాటయు
వేణుస్వానంబు వేనవేల్పొందములన్. ౫౭

వ. అని చండాలకన్య పలికిన నవ్విప్రుండు భవితవ్యతాబ
లంబున. ౫౮

సీ. ఇది యసజ్జనగోష్ఠి యిది మోహవిలసితం
బిది మహాపాతకం బిది యకీర్తి
యిది దుర్మదాంధత్వ మిది యాగ్రహావేశ
- - - -యిది కుదృష్టి
యిది నారకద్వార మిది ప్రమాదస్థలం
బిదికార్ఖ్యకారణం బిది యనియతి
యిది యధర్మముత్రోవ యిది పథప్రచ్యుతి
యిది యధోగతిహేతు విది యకృత్య
మని విచారింప కవనీసురాధముండు
కల్కిచండాలకన్యపైఁ గన్నువైచెఁ
దీయతీయనివింట లేఁదేఁటినారి
శంబరారాతి మోహనాస్త్రంబు దొడిగి. ౬౦

వ. ఏయునప్పుడు నిజాంతర్గంబున. ౬౧

సీ. మాంసంబు భక్షింప మనసువెట్టిననాఁడ
దాక్షిణ్యగుణము విధ్వంసమయ్యె
గంజాయిఁ దినఁగ నుత్కంఠఁ జేసిననాఁడ
లజ్జాభిమానంబు లుజ్జగిల్లె
హాలారసము గ్రోల నభిలషించిననాఁడ
సూనృతోక్తులసుద్ది చూఱవోయెఁ
బరకళత్రముల వెంబడఁదలంచిననాఁడ
ప్రజ్ఞావిలాసంబు పదటఁగలసె

నింక నేటికి వంచింప నిలుపునాకు
బగువె యీపాపములలోనఁ బాపమొకటి
వరుసవేయింటిమీఁద జవ్వాదిగొమ్ము
తివుటఁ జండాలకన్యకఁగవయువాఁడ. ౬౨

వ. అని పరమసాహసంబు చేసి సుకుమారుండు చండాల
కన్యకం జేర వచ్చి యిట్లనియె. ౬౩

కవిరా. సరసిజలోచన యొక్కమహాముని శాపవశంబునఁ
బాణచివై, ధర జనియించినదానవు నీవిది తథ్యము
కిన్నరభామినివో, గరుడపురంధ్రివొ యక్షవధూ
టివొ గాని జఘన్యవు గా విఁక నక్, ధరణీసురో త్త
మునిన్వరియింపుసుధాకరసూర్యులు సాక్షులుగాన్.

వ. సామాన్యస్త్రీజనంబుల కిట్టియమానుషలోకోచితంబు
లైనసౌభాగ్యంబులుం గల్గునె మునికోపవశంబున స
ముజ్ఝితదివ్యశరీర లగుదేవకాంతలు శాపవశోపనీతం
బైన శరీరంబు నధిష్ఠింతురు తొల్లి స్థూలశిరుం డను
మహాముని త్రిభువనలలామభూత యగురంభ నేదేని
యొక్కనిమిత్తంబున శపించె ననియును దచ్ఛాపంబున
నయ్యప్సరస బాడబరూపంబు ధరియించి మృత్తికావ
తియందు శతధన్వుఁ డనురాజును సేవించుచుం బెద్దకా
ఁబు మర్త్యలోకంబున నుండె ననియును విందుము-

సీ. జలజగర్భునిమానసంబు వేదంబులు
దక్షప్రజాపతి దర్పకుంచు

సౌదామనీవల్లి చంద్రికాలోకంబు
సప్తజిహ్వాజ్వాలసప్తకంబు
రవిమయూఖములు నీరవని దుగ్ధాంభోధి
మృత్యుదేవతనోరి మెఱుఁగుఁబండ్లు
ముని కరిష్టాదేవికిని సంభవించిన
దివ్యగంధర్వజాతిద్వయంబుఁ
గారణంబులుగాఁ బుట్టినారు పద్మియుఁ
వాల్గుకో ట్లప్సరసలు నా నాకసతులు
వారిలో నొక్కతెవు నీవు వారిజాక్షి
యేమిదుష్కృతిఁ బుట్టితో హీనజాతి. ౬౬

గీ. తివుచుచున్నది భవదీయదృగ్విలాస
మెత్తుకొనిపోవుచున్నవి యింద్రియములు
వెనుక ద్రొబ్బుచునున్నాఁడు మనసిజాతుఁ
డేమి సేయుదుఁ జెప్పవే యిందువదన. ౬౭

గీ. వనిత నీచిత్తమున కేను వత్తునేని
కామతంత్రంబునకు సంచకర్వు గాఁగఁ
జుంబనము సేయని మ్మోష్ఠబింబ మిపుడు
గండుఁగోయిల చిగురాకుఁ గమిచినట్లు. ౬౮

గీ. అనుచు విప్రుండు తమకించి యంటుకొనియె
సమ్మతించియయుండె నాచంద్రవదన
శూకలాశ్వంబు నన రేఁపఁజొచ్చినప్పు
డనుమతింపదె యత్తఱి వైనబడబ. ౬౯

వ. ధీరోదాత్త యగుట నమ్మత్తకాశిని చిత్తజాయత్త యయ్యు
నః దత్తఱపాటు లేక యతనితో ని ట్లనియె. ౨౦

సీ. కలుగుచున్నవి యనేకములు వికల్పము
లాడుచున్నవి యపాయంబు లెదుర
నంతరాయము లసంఖ్యములు గన్పట్టెడు
సందేహములు పెక్కు చాయవాఱె
నంకురితములయ్యె శంక లేరాశంబు
వికృతు లెన్నని యావిష్కరించె
శాఖోపశాఖలఁ జాఁగుచున్నది రట్టు
గుఱి లేక యుదయించె గోసనాస
యిన్నిటికి నోర్చి నీకోర్కి యేను దీర్తు
నింతవానికి నన్నిగు లెరవె - - -
యెప్పటికి నిత్తునో లేక యీశరీర
మిప్పటికిఁ జాలునో నిక్క మెఱుఁగఁ జెపుమా. ౨౧

గీ. మొదలఁ గక్కుర్తిపడి కూడి పిదప వాయు
నొక్కకమలాననకు డక్కి యుండఁజాలఁ
డడవిఁ బెక్కుపుష్పంబులయందువ్రాలు
చంచరీకంబు మగవాఁడు సరియసువ్వె. ౨౨

ఉ. చందురుఁడంత చూడఁడు నిశానటిఁ బున్నమనాఁడు
గూడుచోఁ, గందళితానురాగుఁడయి కానఁగవచ్చు న
వోదయంబులం, జందము దప్పి మీఁద నొకచాయకు
వచ్చుఁ గ్రమక్రమంబునఁ, సుందరిపట్టునందుఁ బురు
షుండును నట్లయకాఁ దలంపుమీ. 23

వ. అనిన విని సుకుమారుండు. ౭౪

క. మగవారల నిందింపకు
తగవును బంతంబు నిజము ధర్మముఁ గృపయున్
మగవారికెగా కెందును
మగువలకుం గలదె చంద్రమండలవదనా. ౭౫

సీ. హరునిచిచ్చుఅకంట నసమాస్త్రుఁ డీల్గిన
రతిదేవి యెట్లు జీవితముఁ జెందెఁ
బాండుభూపాలుండు పరలోకగతుఁడైనఁ
గుంతి చావక యేమి కుడువనుండెఁ
బ్రథనాంగణమున సౌభద్రుండు చచ్చిన
బ్రతికె నెట్లు విరాటరాజతనయ
సింధురాజస్తమించిన నేల దుస్సల
కాషాయవస్త్రంబు గట్టుకొనియెఁ
బంక్తిరథుఁ డన్యలోకసంప్రాప్తుఁ డైన
నేల కౌసల్య ప్రాణమీ నెఱుఁగదయ్యెఁ
దగవు ధర్మంబు వాఁడి పంతంబు లెట్లు
భామలెట్లు వృథానులాపంబు లేల? ౭౬

గీ. అనినఁ జండాలకన్యక యాఁడువారి
మంచితనమును మగవారి మంచితనము
సరియె కీడని మేలని చర్చలేల
మనకు మనయాడికలు తప్పకునికి చాలు. ౭౭

వ. విశ్వావసుం డనుగంధర్వరాజునకు మేనక యనునప్సర సకుం బ్రభవించిన ప్రమద్వరయనుకన్యక స్థూలకేశా శ్రమవనంబునఁ బాదమర్దితం బగుపన్నగంబు గఱచినఁ బ్రవిలుప్తజీవిత యగుట యు భార్గవుం డగుచ్యవనునకుఁ బౌత్రుండు ప్రమతికొడుకు రురుం డాయురర్ధం బొసంగి యయ్యంగన బ్రతికించె ననియును, సర్జునుం డశ్వమే ధాశ్వానుసారియై యాత్మజుం డగుబభ్రువాహనుచేత నాహవాంగణంబున శరాహృతప్రాణుండైన నులూచి యను నాగకన్యక రసాతలంబుననుండి యే తెంచి యు ద్గతప్రాణునిం జేసె నని యు విందుము, మంచితనంబు లాఁడువారికి మగవారికి సరియ ప్రసిద్ధి యటులుండె నాపంతంబు వినుము. ౭౮

ఉ. నాకు మనంబునిండ నొకనమ్మిక సేయుము - - - -
గైకొనువాఁడ నిన్నునుము కాదన కెక్కుడకై సవచ్చెద
న్నీకొకటయ్యెనేని యవనీసురమన్మథ నిర్విశంకత
న్నాకముఁజూఱవెట్టెదధనంజయతీవ్రశిఖాముఖంబునన్

వ. అనిన విని సంతోషించి సుకుమారుండు. ౮౦

సీ. కలహంససంపద గలకలక్రేంకార
కలకలంబైనయీకొలను సాక్షి
ప్రసవసౌరభనటద్బంభరంబైనయీ
వలనిలతామండపంబు సాక్షి
ప్రచ్ఛాయశీతలోపరిభాగమై(నయీ)
శశికాంతమణిశిలాస్థలము సాక్షి

తరులతాగుల్మసంతతపిధానాతప
వ్యాపారమైన యీవనము సాక్షి
మకరకేతనుపాదపద్మములు సాక్షి
రతిమహాదేవిజఘనభారంబు సాక్షి
సత్యమెన్నఁడు నినుఁ బాయ సమ్మతించి
కౌఁగిలింపఁగనీఁగదే కమలవదన. ౮౧

వ- అనినఁ జండాలి కరారవిందంబులు మొగిడిచి సవిన
యంబును సగౌరవంబును సానురాగంబును గా నతని
కిట్లనియె. ౮౨

ఉ. నేఁడు కృతార్థులైరి జననీజనకుల్ఫలియించెఁ బుణ్య
ముల్, నేఁడు పురాకృతంబు లవనీరుహమూలనివాసి
యైనకా, ట్రేఁ డిలువేలు పోచు నొనరించె* మనోరథ
సిద్ధిసంపదల్, నేఁడుగదా సుధారసము - - - - గంటి
ధరాసురోత్తమా. ౮౩

ఉత్సాహ. మలుసమర్త నంటకుండి మాలదాన నగుట నేఁ
గలయ నీళ్ళనాడికడవ గ్రంత యంటుకొనుటకై
కొలనఁ గ్రుంకి పోవుచుండి కుసుమబాణనిభుని ని
న్నలఘు - - - - లోచనంబు లలరఁ జూచి
వలచితిన్. ౮౪

గీ. ఏమిసేయుదు నీకు నెట్టిత్తు నన్నుఁ
బంచముని యింటఁ గలుగు బీభత్సునెత్తిఁగి

---

* ట్రేం డిలువేల్పుడై యొనరించె- మూ.

యిచ్చగింపకయుండ నేనెట్లు నేర్తు
నధికతర మైనమన్మథాయత్తు నిన్ను.	౮౫

వ. అనిన సుకుమారుండు చండాలకన్య కిట్లనియె.	౮౬

శా. ఏమాసించినఁ బ్రాణరక్షకయి యేమేఁ బాపము ల్సేసి
నన్, భామా చెల్లుఁ బురాణసంహితలఁ జెప్పఁగా విం
దుమే కాదె వి, శ్వామిత్రుం డెడ నైనచో శునకమాం
సంబున్ భుజింపండె సీ, న్యాయగ్రాహ్యాకుచంబు లంటి
యిదె నాప్రాణంబు రక్షించెదన్.	౮౭

వ. ఇదె యెదుర సభ్రమరకలచరణనఖశిఖాశిఖరవిశీర్య
మాణ కుసుమకేసర రేణుత్రసరేణువిసరవిసం - - - -
రంబులతామండపం బిదె వెనుకఁ గుటిలశుకత్రోటి
కోటీవిపాటితమధురఫలరసధారాసారదుర్దినాయమా
నాభ్యంతర ప్రదేశంబు చూతతరువాటికాభ్యాశం బిదె
కెలన మదకలమల్లికాక్షపక్షపాళీనవపవనసంపాతకంప
మాన కమల కేసరపరాగధూళీ విరచి తాళీకసంధ్యాను
బంధచకిత చక్రవాకనీడోద్భవ క్రీడానీడంబులు, సరస
సైకత వేతసీనికుంజక్రోడంబు లిందు నీకు నింపుపుట్టినట్టి
యెడ నన్ను మన్నింపు మంటకున్నదాన నని భయం
బందకు కుసుమసమయంబు గదా ఫలావాప్తికి మూలం
బింకఁ గాలక్షేపంబు చేసితేని కందర్పుండు దర్పాతి
రేకంబున భవద్భ్రూవల్లీమతల్లికిం దల్లియగునించువింటి
బద్ద దిగిచి కోదమతుమ్మెదతెక్కగఱిగట్టిన పూమిట్ట

కోలల హృదయం బుద్ఘాటించి చంపుఁ జంపకకుసుమ
గంధీ ప్రాణంబు రక్షింపు మిదె నీకు సేవాంజలి యని
కంకణఝణఝణత్కారంబు తోరంబుగా సుకుమా
రుండు నఖకిరణపరంపరాకుసుమకుట్మలాభిరామంబు ల
గుకరకిసలయంబులు మోడ్చి ఫాలభాగంబునంగీలించిన.

శా. వాలాయంబుగ నద్ధరాసురుఁడు దన్వాంఛించిన స్మం
దహా, సాలం(కారను) నోజ్ఞ మైనముఖ మొయ్య న్వాం
చి చండాలి యా, లీలాంభావ మెఱింగి (యేగి) నతవల్లీ
కుంజమధ్యంబునం, గేలీతల్పముఁ దీర్చెఁ బో మృదులకం
కేలీప్రవాలంబులన్. ౮౯

వ. అనంతరం బధరీకృత కుసుమా(యు)ధధర రూపసంప
న్నుఁ డగునవ్వసుధానిలింపుం డపహాసితసురసిద్ధగంధ
ర్వవిద్యాధరలీలావిలాసినీవిలాసవతి యగు నవ్వెలివాడ
చేడియం గూడి సురతసౌఖ్యం బనుభవించె నంత. ౯౦

ఉ. కాయజవిక్రియం బడయఁగానికులంబున సంభవించి
యు, న్యాయము సేయునే యిటు దురాత్ముఁడు వీఁడు
త్రపాభిమానముల్, మాయఁగఁదట్టి యంచు నతిమా
త్రము లజ్జితుఁ డైనకై వడిం, దోయజషండబాంధవుఁ
డధోముఖుఁ డయ్యె నభోఽంగణమ్మునన్. ౯౧

గీ. గగనయానవేగంబునఁ గలమరించి
కడుపునిండంగఁ గ్రోలిన కమలమధువుఁ
గ్రక్కెనో నాఁగ గగనమార్గంబునందు
భానుబింబంబు రక్తాతపంబుఁ గాసె. ౯౨

శా. ప్రాలెం బశ్చిమశైలశృంగముపయిం బ్రత్యగ్రమధ్వా
గమో, న్నీలత్కింశుకకోరకస్తబకకాంతిన్ భానుమన్మం
డలం, బాలంబించె మరుంపు హస్తమున దాటూరాను
లీలావతీ, భ్రూరేఖానిభవిభ్రమాభ్యుదయముం బుండ్రే
క్షుకోదండమున్. ౯౩

క. క్రుంకె విభాకరబింబము
పంకజషండములు మొగిడెఁ బ్రత్యగ్వీథిం
గంకేలీతరుపల్లవ
సంకాశచ్ఛాయఁ గొమరుసంజ జనించెన్. ౯౪

గీ. పద్మినీషండములనుండి పాసి చనియెఁ
గోకమిథునంబు లత్యంతశోకపరతఁ
దోన యేతెంచె భ్రమరసందోహ మపుడు
కంఠలోహార్గళంబులకరణి మొఱయ. ౯౫

వ. ఇవ్విధంబునం బ్రతీచీకర్ణపూరరక్తోత్పలంబును జక్రవా
కచక్రవాళకులచక్రవర్తి యు నగు మార్తాండుండు లో
కాంతరంబున కవతరించినఁ గ్రమంబున నంబరతటాకవి
కచకమలిని సంజ మంజుమంజిష్ఠాపరాగసౌష్ఠవంబు సం
ధించెఁ గృష్ణాగురుపంకవల్లికల యుల్లాసంబు నుల్లసంబా
డుచుఁజిలుపచిలుపచీఁకటి సిద్ధవిద్యాధరనితంబినీజనంబుల
చొక్కుటద్దంబులతోడం జరలాడె సాంధ్యదేవార్చనా బలి
పిండంబులుంబోలె గగనమండలంబున వెండితగటుఁ దె
గడి క్రిక్కిఱిసి చుక్కలు వొడిచెఁ బురుహూతాంత;

పురపురంధ్రీవిలాసదర్పణంబు దర్పకునిమాటుఁ బొంది చందురుం డుదయగిరి శృంగశృంగాటకంబునఁ బటికం బుగుండుచందం బొందె నప్పుడు చండాలకులవరారోహ వాహకుం డెక్కి విడిచిన వారువంబుఁగొదమయుం బోలె సంభోగంబునం దృప్తిచని తనివోవనికౌతుకం బున సుకుమారుఁ గౌఁగిటం జేర్చి యి ట్లనియె. ౯౪

ఉ. అల్లదె వేఁటపల్లె యటనావల మావిలివాడ యావలన్
భల్లనిపాతమాత్రమునఁ బర్వతనిర్ఝరసింధు వావలం
దెల్లనిగోపురంబుల నతిప్రమదావహ మైనరోహిణీ
వల్లభమాళిభామిని నివాసము - - - - లాప్రదేశముల్.

గీ. ప్రతిభ సతతంబుఁ గొల్తురాభద్రకాళి
జగతి నేఁబదియాఱు దేశములవారు
దశదినంబులు సింహకేతనము నిలిపి
హూణభూమికి దైవ మీయుత్పలాక్షి. ౯౫

వ నివమ్మహాస్థానంబున వసియింపు మేను నీకు నాయావేళ లఁ బరిచర్యసేయుచు వంచన బయల్పడకుండ మెలంగెద సర్వకళావిశారదుండవై ననీకుం బ్రాకారగోపుర ద్వారవేదికాప్రాకారప్రఘాణకుట్టిమహట్టసౌధవీథీవిటం కంబులం గావ్యగోష్ఠీపరిహాసకథాబిందుమతీభిత్తికాప్ర హేళికాభావన సుభాషితశ్రవణంబు, వారవిలాసినీద ర్శనంబు, వైతాళికస్తుతిపాఠకంబు, దురోదరక్రీడ, చిత్ర కర్మంబు, వీణాస్ఫాలనంబు మొదలయినవినోదంబులం బ్రొద్దు పుచ్చంగలిగెడి వెండియు. ౯౬

క. వెలివాడకుఁ గడుఁ జేరువ
సెలయేటికిఁబోరుపు త్రొక్కుఁ జిట్టీఁదులు నా
వలఁ ద్రఉచు భద్రకాళీ
నిలయుం బదిలెస్స నీకు నెలవు వసింపన్. ౧౦౦

గీ. ప్రొద్దు వోకుండ ముందటఁ బోదము నీవు
కాళికాస్థానమునకు నీకాలిత్రోవ
విప్రగృహమున నీకు నే విందొనర్తు
శర్మిష్ఠమున నింటి పెద్దలకుఁ జెప్పి. ౧౦౧

వ. - - - - చెలికత్తెయుఁ దానును వేఱొక్క తెరువున నిజనివాసంబునకుం జనియె సుకుమారుండు చెఱువు కొమ్ముదాపలం బట్టుకొని విపినషండంబు నడుముగాఁ బక్కణంబునకు దక్షిణంబుగా నొరసికొని పోయి కాలిత్రోవం జని సెలయేఱు గడచి ముందట. ౧౦౨

సీ. బ్రహ్మ యెక్కెడిజాలపాదంబునకుఁ గేలి
వసతి యైనసరోజవాటితోడ
నైంద్రవాహన మైనయైరావణగ - - -
- - - - (?)చే మొక్కయీఁదుపులతోడ
వైష్ణవరథ మైన వైనతేయున కాఁగ
నిరవైనప్రాకారపరిధితోడఁ
గౌమారయానశిఖావళంబునకుఁ దాం
డవమాడ సొబగైనగవనితోడ

వేడ్క మాహేశ్వరం బైనవృషభరాజు
దాఁక నిల్చిన కేలిభూధరముతోడ
సకలభక్తనివాసమై చాలనొప్పు
చండిభవనంబు సొత్తెంచె సచివసుతుఁడు. ౧౦౩

మ. తనదా శీలము తా నెఱుంగుట వెలిన్ దాదవ్వుల న్ని
(ల్చి దు), ర్జనుఁ డాతండు లలాటభాగమున హస్తద్వం
ద్వము న్మోపి యొ, య్యన లోలోన నమస్కరించెఁ బ
టుగర్వారంభసరంభశుం, భనిశుంభప్రథనక్రమప్రకట
బాహాకేళికిం (?) గాళికిన్. ౧౦౪

ఉ. మాలెతవిందు బ్రాహ్మణకుమారుఁడు పక్కణవాసి వే
ణుకం, డోలమునందుఁ దెచ్చినఁ గరోరితచంద్రిక నిర్ఝ
రాపగా, కూలమున న్భుజించి ఘనగోపురవేదిక నిద్ర
వోయెన, య్యాలరిబ్రాహ్మణుండు తుహినాచలకన్య
కయాశ్రమంబునన్. ౧౦౫

వ. మఱునాఁడు ప్రాతఃకాలంబున నిర్ఝరాంభఃప్రవాహంబున
నవగాహనంబు చేసి కపటసంధ్యావందనంబును గృత
కజపంబును సూర్యోపాస్తియు నడపి బ్రాహ్మణబ్రువుండు.

సీ. దంతిదంతార్గళస్తంభభారముతోడ
రాజిల్లుఘనగోపురములు చూచి
గండశైలచ్ఛేదఘటితమై యొరపైన
మేటికొమ్మలతోడికోట చూచి
యమృతదీధితిలో నిహారిణంబు వెలిపించు
సౌధాగ్రసింహధ్వజములు చూచి

యాటమండపముపై నభ్ర ముల్లేఖించు
జాంబూనదత్రిశూలంబు చూచి
చమురుగా - - - - మగుచ్ఛములుపోలె
సకలశాఖోపశాఖలసంశ్రయింపc
బుష్పితాశోకపాదపంబులనుజూచి
నింబములుసూచి యతc డద్భుతంబు నెందె. ౧౦౭
ఉ. కాళికదివ్యమందిరము - - - - - దనాళకీ,
లాలరసంబు గ్రోలునభిలాషమునం జనుదెంచియున్న వే,
తాళగణంబుపోలె నతిదైర్ఘ్యమునc దివి దాcకియున్న
హింం, తాళవనంబు గన్గొని (యతండు మహాద్భు) త
మందె నాత్మలోన్. ౧౦౮
ఉ. పైపయి గర్భగేహమునc బన్నికమీాఁతి వెలుంగు మా
లికా, దీపశిఖాప్రరోహములు దేఱగcజూచి యనుస్మ
రించె లో, నాపృథివీసురుండు మహిషాసురమస్త - -
-దు, గ్గాపరమేశ్వరీపదనఖంబులడంబుల సంచరించివన్.
గీ. సరసవనవాటికానికుంజములయందు
నెలుక లధరోష్ఠసంపుటంబులు గదల్ప
శక్తిమంత్రాక్షరంబుల (జపముసేయ)
నవియువలె నున్న నద్భుతంబందె నతcడు. ౧౧౦
సీ. మంత్రవాదులతోడిమైత్రి సంపాదించు
యంత్రవాదులc గని యాదరించు

సిద్ధయోగీశ్వరశ్రేణి సంసేవించు
ధాత - - - ందనము సేయు
కదలి పశ్వాశ్చపశ్చకథలెఱుంగఁగఁగోరు
బిలము సాధింప నపేక్ష సేయు
బహుదేశభాష లభ్యాసింప వాంఛించు
శల్యతంత్రము మీఁదఁ జొరవు మనను
- - - - గఁ బెన్నిధిగుద్దలించు
నింద్రజాలంబు వన్నంగ నిచ్ఛగించుఁ
గట్టి భవనములకు సురంగములు ద్రవ్వ
నేర్చికొనుఁ బ్రత్యహంబును నీచబుద్ధి. ౧౧౧

చ. స్థితిచెడి మాంసభో(జనము సేసి) యసంగమవంశభా
మినీ,రతిఁ బరతంత్రుఁడై నడుపుఁ బ్రత్యహమున్ ధరి
యించుచుండు న, ప్పతితుఁడు గంగమట్టియయుఁ బ్ర
న్నని నున్నని నీరుకావిదో, వతులును - - - ములు
వంశ్యులయిండ్లభుజించుకోరికన్. ౧౧౨

గీ. మాధుకరభిక్షులను స్వయంపాకములను
సత్రభోజనములఁ బిత్రుశ్రాద్ధములను
విందులను దేహయాత్ర గావించు సతఁడు
వేదశాస్త్రపురాణప్రవీణుఁ డగుట. ౧౧౩

సీ. నీరాటనెపముగా నిర్ఝరంబుల కేగి
సవిధవానీరకుంజముల నొందు
భూధరంబుల కిప్పపువ్వేదే నని పోయి
కందరామధ్యభాగముల నొందు

(శిఖరీంద్రవర)కన్య సేవింప నని పోయి
నక్తమాలములనెన్నడుము నొందుఁ
గలమసస్యక్షేత్రములకుఁ గూళ్లొగి మోసి
శణవాటికాప్రదేశముల నొందు
నెట్లు కనుఁబ్రామి వచ్చునో యింటివారి
నెట్లు (చీఁకటి నొం)టిమై నిక్క కరుగు
నతివ పగలైన మాపైన నతనితోడ
నిచ్చ నొకపారి సాగించు నిధువనంబు. ౧౧౪

వ. ఒక్కనాఁ డక్కనిష్ఠవర్తనుండు పక్కణశబరులం గూడి కరిక్రవ్యాదంబు గుకు - - - కొని ప్రత్యూషకాలంబున విపినవీథుల నీవారభసలవిఘటితసరఃకమలషండసౌరభోద్గారభరితదిక్కటాహంబు కరటిమార్గం బిది, విదళితసమస్తముస్తాశకలసారంబు వరాహయూథపథంబిది, కఠినపాషాణకోటివిభిద్యమానవల్మీక ధూళిపాళికానిచుళితతరుపలాశంబు మహిషవర్త్మం బిది దూర్వాప్రవాళచర్వణహరిచందనపరిపాండురంబు హరిణమార్గం బిది, కటుదీర్ఘఘుర్ఘురవ్యాక్రోశంబు కర్కరేటుకులకులాయస్థానం బిది - - - - కహారవంబు, దాత్యూహవ్యూహ ప్రదేశఁబు ననుచు నాఖేటకౌతుకంబున నాఖేలనక్రీడావిహారంబులఁ గృశుం డై, ప్రాణిహింస యొనర్చుచు నెండియు. ౧౧౫

గీ. పాపకర్ముండు కాంతారపథమునందు
నదరిపాటున నొంటిబ్రాహ్మణుల మొత్తి
యపహరించినవిత్త మన్యాయపరత
నంత్యజస్త్రీయుఁ దాను ననుభవించు. ౧౧౬

గీ. ఇవ్విధంబున సుకుమారుఁ డీలు వుడిగి
మాలచిగురాకుఁబోఁడితో మనువుమనఁగ
వచ్చె నొయ్యన మధుమాసవాసరములు
వాసితాశోకసంఫుల్ల కేసరములు. ౧౧౭

సీ. కామినీగండూష కాదంబరీధారఁ
బులకించె నారామభూమిఁ బొగడ
చివురాకుఁ జవిచూచి చవిచూచి యెలుఁగించెఁ
బంచమస్వరమునఁ బరభృతంబు
సంఫుల్లకోరకస్తబకోచితం బైన
కొరవిపై భ్రమయించెఁ గొదమతేఁటి
పరిపక్వసహకారఫలరసాస్వాదన
ముదమునం గీరంబు చదువఁదొణఁగె
విటవిటీసముదయములు వివిధవిధుల
నుపవనక్రీడ సల్పిరి యుబ్బుమిగిలి
యఖిలజనులకు సంతోష మావహించె
మాసరము లైనమధుమాసవాసరములు. ౧౧౮

వ. ఇట్లు సకలజనమనోహరంబు లగుమధుమాసవాసరంబు
ల నప్పాపిష్ఠుఁడు చండాలకన్యకం దగిలి యొం డెఱుం

గక లజ్జ యుజ్జగించి మానం బూనంబుచేసి కులంబు పదటం గలిపి శీలంబు పరిత్యజించి దిట్టకూళయై కన్ను గానక కావరంబెత్తి తిరుగుచుండఁ గర్ణాకర్ణి నతని దుశ్చారిత్రంబు లెల్ల విని యక్కడక్కడ నాడికొనం దొణంగి రంత నెం తేనియుఁ దేటతెల్లం బైనక్రియ నతని దుర్వర్తనంబు ప్రసంగించి ప్రకాశంబుగా నాడుచుండి రంత. ౧౧౯

క. క్రూరాత్ముఁ డితఁ డనఁగాఁ
ఘోరుం డితఁ డనఁగ నితఁ డశుద్ధుం డన దు
శ్చారుఁ డితం డనఁగా సుకు
మారున కపకీర్తి హూణమండలిఁ [redacted]న. ౧౨౦

వ. అంత నొక్కనాఁ డతండును నదియును బాతాళపంక కలుషం బగుమహోజలధిపూరంబునుంబోలె నంధకారంబు తోరంబై దిక్కులఁ బిక్కటిల్ల బహుళపక్షంబు నాఁటి రాత్రి కాళికాగోష్ఠంబు కెలన జీర్ణోద్యానంబు నడుమ నక్తమాలతరుషండంబులో వార కల్పించిన సంకేతస్థలంబునం దృణకుటీరంబునం గోద్రవపలాశ పర్యంకంబున మదిరామదోద్రేకసంభవం బైనమదనావేశంబున మనోభవశరసీత్కారంబులనుంబోలె సీత్కారంబులవలనను బంచబాణమాణిక్యకంకణక్వాణితం బగు నప్పుడు - - - ౧౨౧

చ. కువలయపత్రనేత్ర కనుఁగొల్కులయం దుదయించె బా
ష్పబిం, దువులు ధరాసురుండు తనుఁ దోడ్కొనిపోక
యుపేక్ష సేయ న, న్నవదరవిందచక్రమిథునంబు లప
హ్యావశాంగజాగ్నిచే, రవులుకొనంగఁ బుట్టిన నిరంత
రధూమము సోఁకిరో యనన్. ౧౨౨

గీ. చాను హృదయంబుమీఁద హస్తంబువైచె
నతఁడు తనుఁబాసి యేగునో యనెడుభీతి
నల్లమునయందు వసియించియున్న తన్ను
వెడలిపోకుండ నడ్డుపెట్టెడివిధమున. ౧౨౩

వ. అనంతరంబ యాచాండాలి యతని కిట్లనియె. ౧౨౪

గీ. ఎట్టు వేగింతు సంసార మిచటనుండి
యేల నిన్నుఁ బాసి యొంటి నా కిచట నుండఁ
గలుగనిమ్ము పెక్కండ్రు బంధులునునాకు
బంధువుగలండె నాకు నీపాటివాఁడు. ౧౨౫

శా. ఇచ్చోట న్మధుపానగోష్ఠి సురతం బిచ్చోట సంగీతకం
బిచ్చోటం బరిపాటి నీకలకలం బిచ్చో మనోజోదయం
బిచ్చోనంచు భవద్వియోగమునఁ దానెవ్వారికింబ్రీతిగాఁ
జచ్చున్ మన్మథవేదనానలమునం జండాలి విప్రోత్తమా.

మ. కరవీరప్రసవచ్ఛదారుణరజఃకాషాయవస్త్రంబుతో
శరతూలచ్ఛవియజ్ఞసూత్రములతో జాంబూనదస్ఫూ
ర్తిత, స్ఫురద్రుద్రాక్షనిటలోర్ధ్వపుండ్రకముతో సాక్షా
చ్ఛుకబ్రహ్మతోఁ, దరమా నిన్ను మహాత్మ రేపకడ సం
దర్శించినం జాలదే! ౧౨౭

ఉ. ధీరత వూని నీవు పరదేశము వోవఁగ నేను రాకయీ,
యూరనె యుంటినే ద్విజకులోత్తమ నిత్యముఁ గాళికా
గృహ, ద్వారవితర్దికాస్థలము దవ్వులఁ జూచినయప్పు
డెల్లాకో, కూరిమి పేర్మి గుండియ దిగుల్లని తల్లడమం
దునోసుమీ. ౧౨౭

సీ. తను నిద్ర మేల్కొలిపినమాత్రమున జర
త్కారుఁడు విడువఁడే ధర్మపత్ని
జమదగ్ని కొడుకుచేఁ జంపింపఁడే భార్య
లవమంత దోష ముల్లమున నిల్పి
యొకమాటు తప్పగావక యహల్యాదేవి
నక్షపాదుఁడు ఱాయి యగుమనండె
స్రుక్కి సన్నఁబుగాఁ జూడఁడే కోపించి
సతి నరుంధతి వసిష్ఠర్షివరుఁడు
తగవు ధర్మంబు పాడి పంతంబు నిజము
వువ్వుఁబోఁడులయెడ లేదు భూసురులకుఁ
బ్రథమమున నీవు సేసినబాస నమ్మి
మోసపోయితిఁ గులమునం దీసువడితి. ౧౨౮

సీ. పద్మాకరమునకుఁ బసుపాడఁదెచ్చిన
దైవంబు చలము సాధ్యంబుగాఁగ
ననురాగరసము నామనములో నూన్చిన
నయనేంద్రియములకుఁ బ్రియముగాఁగ
విడువ నిన్నెన్నఁడు విశ్వసింపవె యన్న
నీసత్యమునకుఁ బున్నియముగాఁగ

నిక్షుకోదండ మెక్కిడి బాణమరిపోయు
కందర్పునకు మహాఖ్యాతిగాఁగ
నెపుడు నీవు ననుంబాసి యేగి తపుడె
నీర నైనను నురినైన నెగడినైన
విడుతుఁబ్రాణంబు లపుడు నీయడుగులాన
పలుమఱునుఁ బెక్కుమాటలు పలుకనేల. ౧౩౦

గీ. అనినఁ జెలునవ్వునవ్వి నీమనను చూడ
నంటిఁగా కేను నినుఁబాసి యరుగఁగలనె
యిట్టిపట్టున నెవ్వరు నెఱుఁగకుండఁ
బోవుటయు లెస్స యీహూణభూమి విడిచి. ౧౩౧

గీ. ఎల్లి శ్రీభద్రకాళికి నిద్దభక్తి
యాత్ర యొనరించి వెళ్లుద మర్ధరాత్ర
మీవిచారంబు చెప్పకు మెవ్వరికిని
వారిజానన రట్టువడ్డార మిచట. ౧౩౨

ఉ. సంగరసవ్యసాచి (నయశాస్త్రవిశారద) దేశికేశ్వరా
మంగళగీతవాద్యపరిమండితమంద్రకరుండలీకళా
భంగురనృత్తభావ్యపరిభాసితసంతతనిర్గలాత్మకా
యంగజసన్నిభప్రథితహాట్టవిశేషమనోజ్ఞవర్తనా! ౧౩౩

క. గౌరీవల్లభసేవా
పారీణవిరాజివిభవభక్తిప్రతిభా
భారోన్నతదివ్యాంగా
సారసగర్భప్రభావ సర్వజ్ఞనిధీ. ౧౩౪

మాలిని. సరససుఖవినోదా సారశైవార్థమోదా
పరమపదవివేకా భానుతుల్యప్రభాకా
ధరణిధరసుధైర్యా దండసంగ్రామశౌర్యా
నిరుపమగుణధామా నిత్యకల్యాణసీమా. ౧౩౫

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్య పుత్ర సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయప్రణీతంబైన శివరాత్రిమాహాత్మ్యంబునందుఁ దృతీయాశ్వాసము.



శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

## (సుకుమారచరిత్రము)

### చతుర్థాశ్వాసము.

---

క. శ్రీతరుణీసితవిలసన
జాతశివానూనభక్తిసంపద్గురువి
ఖ్యాతనుతకీర్తిసితజీ
మూతసితాఖిలదిగంత ముమ్మయశాంతా. ౧

గీ. అక్కథకుఁడు శౌనకాదు లైనమహాము
నీంద్రులకుఁ బ్రియమున నిట్టు లనియె
నట్లు భూమి విడిచి యరుగవలయు నింక
ననుచు మాటలాడునవసరమున. ౨

క. తెలతెలవాఱుచువచ్చెం
బలపలనయ్యెం బయోదపథమునఁ దారల్
కలకలవింకలకోమల
కలకలములు చెలఁగెఁ గాళికావిపినమునన్. ౩

సీ. సంభోగపరిఖిన్నశబరసీమంతినీ
స్వేదవార్బిందువిచ్ఛేదకారి

విఘటమానాంభోజవిపినషండమధూళి
పరిమళాసారసంపర్కసురభి
సమదకాంతారకాసరయూథసమ్మర్ద
సంభూతడిండీరశకలవాహి
లలితలుంగలవంగలవలీమతల్లికా
లాస్యోపదేశలీలాగురుండు
యామినీశేషతుహినధారానుషంగ
జడిమభరమందచతురసంచారకారి
యల్లనల్లనఁ బొలుపారునడవినడుమఁ
గాల్యసంధ్యాసుగంధుండు గంధవహుఁడు. ౪

ఉ. క్షోణిరుహాగ్రభాగముల జోకలుగట్టి వనీశిఖావళ
శ్రేణులు తాండవంబు లొనరింపఁగ మంద్రగభీరభంగి
శ, ర్వాణిగృహాంబులోని బలివైభవలీలకు ప్రోసెఁ
గంచుని,స్సాణము మాటిమాటి కనుశబ్దము లీనఁగ
గోపురంబునన్. ౫

శా. నిష్ఠాసంపద నర్ఘ్యపాణు లగుచు న్విప్రు ల్ప్రశంసింప
మం, జిష్ఠారాగము మండలంబున నధిష్ఠింప న్నలిం
పాధిభూ, కాష్ఠామధ్యమునందుఁ దోఁచెను శతాంగ
ప్రష్ఠ సర్పద్విష, జ్జ్యేష్ఠుం డప్పుడు నిష్ఠురప్రసరబంహి
ష్ఠద్యుతిశ్రేష్ఠతన్. ౬

వ. ఆదివసంబున. ౭

ఉ. జాతరచేసె బ్రాహ్మణుఁడు చండికిఁ గమ్మనిపిండివంటతో
నేతులతోడ మద్దికడ నిర్మలినాన్నముతో రసావ

ళీ, చూతఫలాళితోడ వరసూపముతోఁ జిఱువాలతో
డుతన్, నీతులతోడ నప్పు డకనిష్ఠతరం బగునిష్ఠ
పెంపునన్. ౮

వ. నాఁటిరాత్రి నిశాసమయంబునఁ గాలకంఠకంఠమూల కాకోలవిషమషీకళంకచ్ఛాయాసముల్లాసంబు నుల్లసనంబు నుల్లసంబాధనిబిడాంధకారంబున నన్నెలవు గదలి చండాలియుం దానును సుకుమారుండు దుర్గమాటవీవిషయంబు హూణదేశంబు గడచి ప్రతిదినప్రయాణంబుల నెడనెడం బక్కణ ---- ౯

గీ. గ్రామఘోషంబు పురివాడ బ్రహ్మలోక
ము --- డు మొగసాల మోక్షమునకు
దూషితంబయ్యె సంసర్గదోషకలన
నంటుముట్టునఁ గలుషితం బయ్యెనాఁడు. ౧౦

క. -- తనయుల నిద్దఱు
తనయులనుం గాంచి కాలధర్మముఁ నొందెన్
వనజాస్య గట్టివయసునఁ
దనయుఁడు పరలోకవిధులు తల్లికిఁ జేసెన్. ౧౧

గీ. ఏమిచెప్పంగ నలువదియేండ్లవయసు
ముసలి సుకుమారుఁ డేకాంతమున రమించెఁ
గూఁతులిద్దఱ బొమలపైఁ గురులువ్రాలు
నంతమాత్రపుఁజిన్నప్రాయంబువారి. ౧౨

వ. అంతం గొంతకాలంబునకు వానిదుశ్చేష్టితంబు లెఱిం
గి బ్రాహ్మణులు వానిని బహిష్కరించి యూరువెడల నడి
చి యారూఢపతితుం డైనవానిసంసర్గంబునం బుట్టినదో
షంబు బుద్ధిపూర్వకంబు గాదు కావునం గొంద ఱుపవ
సించియుం గొంద ఱుత్తప్త కృచ్ఛ్రంబు లనుసరించియుం
గొందఱు కృచ్ఛ్రాతికృచ్ఛ్రంబులు నడిపియుం గొందఱు
చాంద్రాయణంబు లాచరించియుం గొందఱు - - - ౧౩

సీ. - - - - - . శాంతశీలలకు
యమదూతలకు నభిధాంతరములు
ప్రతిబింబములు కాళరాత్రి యామములకుఁ
బుత్రసంతానంబు భూతములకు
నశుభకర్మముల కన్వాదేశములు మాని
శాపాత్తురములకు సంగడీలు
కలికాలమునకు డగ్గఱినచుట్టంబులు
ధూమకేతువులకుఁ దోడునీడ
లంధకారంబులకు విందు లనఁగ గిరుల
యందువర్తించుచెంచుల నాశ్రయించి
మనువుమనెఁ గూఁతులుఁ దాను మహిసురుండు
కొంతకాలంబు మనములోఁ గుత్సలేక. ౧౪

క. ఎనుబదియేఁడులవార్ధక
మునఁ బ్రాక్తనశక్తి యుడిగి పోవాతనికిం

దినియెడిది పెద్దమాంసము
కానియెడి దిది కల్లు మనసుక్రొవ్వెట్టుడుగున్. ౧౫

గీ. కాంచె నిద్దఱు సుతుల నక్కామినులకు
వావి వర్ణంబు మాలినవద రతండు
శాస్త్రములఁ జెప్పఁబడినదోషంబు లెన్ని
యన్నియును జేసె నాతఁ డేమనఁగఁగలదు. ౧౬

వ. అంత. ౧౭

క. హేమంతము శరదాగమ
సామంతము తుహినకరవిసంజ్ఞితశబరీ
సీమంతము మదనబల
శ్రీమంతము డాసె భువనసీమాంతంబై. ౧౮

మ. బలుసుల్పండెను దొండముక్కువడియెంబ్రాసంగుఁజే
లొప్పెఁ గమో, కలపూఁబాళలతావిఁ గ్రోలి పొరలెం గా
బేరదిగ్వాయువుల్, ఫలినీవల్లిమతల్లివల్లరులపైఁ బైపై
నలివ్రాతముల్, పొలసె న్మంచులు రాలె రాత్రికరిణీ
ఫూత్కారవార్బిందువుల్. ౧౯

చ. కలమవనాళికాకణిశకంటకకోటులచేతఁ జూడ్కి కిం
పలవడిచె న్ధరిత్రి తుహినాగమవేళఁ దటాకసారణీ
సలిలమువాఁటిపండినయజాంగలసీమములెన్నియన్నిటం
దలమగుసీతుపేర్మిగదుదాల్చినభావముప్రస్ఫుటంబుగ౯

క. కలవింకకలకలాకుల
వలభీగర్భములు సౌధవాటములు పురం

బులయందుఁ దుహినవేళలఁ
జలి గులగులఁగూయునట్టిచందం బొందెన్. ౨౧

కం. పెనుఁజలి గడగడ వణఁకుచు
వనదేవత దంతవీణ వాయించెనొకో
యన మోక ప్రేంకణంబులు
వనగుత్తులమొఱసె నళిగణము విపినములన్. ౨౨

శా. బింబోష్ఠీకుచకుంభభారము లురఃపీఠంబులన్ హత్తి మో
దంబార న్మృదుకేలిశయ్యల శుభాంతర్గర్భగేహంబులం
దాంబూలీదళభాగపూరితముఖుల్ ధన్యాత్మకు ల్శీతకా
లం బెంతేనియు నిద్రవోదురు నిశల్ సంభోగలీలావధిన్.

సీ. ధనదశుద్ధాంతకాంతాపయోధరభార
సంవ్యానపల్లవస్రంసనములు
కైలాసగిరికూటకల్పద్రుమాటవీ
కుసుమగుచ్ఛరజోఽవగుంఠనములు
చంద్రభాగాసరిత్సలిలవీచీఘటా
ప్రేంఖోలికాకేళిరింఖణములు
రాధాపురీహర్మ్యరత్నహేమగవాక్ష
సంవేశనక్రియాసౌష్ఠవములు
వలనుగాఁ జంపకారణ్యవాటిఁ దరిసి
కాశి యొరసి కళింగాంధ్రదేశసరణి
దక్షిణము సాఁగెను సపాదలక్షశైల
కటకబంధుఁ డుదగ్దిశాగంధవహుఁడు. ౨౪

గీ. చలి ప్రవేశించు నాగులచవితినాఁడు
మెఱయు వేసవి రథసప్తమీదినమున
నచ్చసీతు ప్రవేశించుఁ బెచ్చు పెరిఁగి
మార్గశిరపౌషమాసాలమధ్యవేళ. ౨౫

గీ. ఇనుఁడు కోదండరాశిమీఁ దెక్కువేళ
నిత్యకోదండవల్లి యెక్కుఁడు మరుండు
సమదవేదండసమమహాసత్త్వుఁ డయ్యె
జనుఁడు కోదండమునుబోలెఁ దనువువంచు. ౨౬

గీ. ఇండ్లమొదలను నీరెండ నీడికలను
ననఁగుఁదమ్ముఁడు నన్నయు నాటలాడు
నత్తయును గోడలును గుమ్ములాడుఁ గుమ్ము
గాఁచుచోటికి మకరసంక్రాంతివేళ. ౨౭

సీ. కాశిలోఁ జక్రపుష్కరిణి దుష్కరశుష్క
గహనావళీదావదహనజిహ్వఁ
గుక్కుటేశ్వరవరకుండి పీఠపురిశం
కాతమస్కాండచండాంశుదీప్తి
దక్షవాటంబున సప్తగోదావరి
కలిదోషపాషాణకులిశధార
గౌతమీతటిని మార్కండేయపురిమ్రోల
దురితాహిసంఘాతగరుడమూర్తి
నిన్నిటను దీర్థమాడంగ నేఁగుదెంతు
రఖిలమునులుఁ బ్రభాతసంధ్యాగమముల

గ్రహాగణేశుండు కోదండరాశిఁ బాసి
మకరమున కేగుదేరంగ మాఘువేళ. ౨౮

మ. పటుఘోషంబు దుహినంబు పండె వరి యిప్ప ల్వ్యాసె
శైలంబులన్. గటెగట్టె స్వలరాజు తేఁటియెఱకం గాం
డ ప్రకాండంబులం, జలుపించెన్ గ్రహారాజుమాఠరకుని
జక్రాద్రికూటంబునం, దటిఁ గౌబేరదిగంతరితుపథ
యాత్రాజై త్రతుత్తుంభమున్. ౨౯

వ. వెండియుంజకోరలోచనల కుచమండలంబునకుఁ గర్పూ
రఖండక్షోదంబుల మేదంచిన చందనానులేపనై పథ్యం
బపథ్యం బయ్యె. రథ్యవేగంబున,ననూరుసారథి రథం
బు ప్రతిఘటనఘృణానతుత్ర క్షోదపాళీచుళుకితోర్థ్వాం
డభిత్తియై యుత్తరాయణంబు గైకొని కులూతశాంకో
దరీకపోలముకురబింబంబులం బ్రతిబింబించె. సవ్యాపస
వ్యక్రమంబునం జక్రమిథునంబుల నెట్టుకొని బిట్టేసి
యేసి విసిగి నిల్చి మనోభవుండు నిగిడించిన నిట్టూ
ర్పునుంబోలె నిశాసమయంబుల నిండువెన్నెలలోనం
జిన్నచిన్న నులివేఁడివడి పొడచూపె. కేదారక్షేత్రం
బులం గలమగోపిక లోడికంబుగా దంచిన నిద్దంబు
లగుదుద్దుగడుప్రాసంగుఁబ్రాలు సద్యోమార్జనావశంబున
నతిస్నిగ్ధవర్ణంబులై కర్ణాటదేశ తాటంకినీదళనవజ్రాం
కురంబుల కాంతిసంపద దలంచె. నీహారవ్యపాయం
బున నిర్మలంబులై బహుళపక్ష ప్రదోషంబులయందుం

దారకంబులు వికచకుముదకోరకంబులు కెలంకులఁ గొలంకులలోనం బ్రతిబింబించి మదకలకలహంసత్రోటి కోటీవిఖండితమృణాలదండఖండంబులభావంబుభజించె. హృదయోత్కంఠాతిరేకంబునఁ గంఠమూలకఠోరకాలకూటవిషమషీ కళంకిపంకచ్ఛాయాచ్ఛటాకుండు భువనరక్షాదాక్షిణ్యుండు దాక్షారామభీమేశ్వరుండు దక్షిణజలధివేలావలయితంబు లగునేలాలవంగలవలీపుత్రల్లికాకుడుంగక్రోడంబులం గ్రీడించుటకునై సారంగలోచనలుఁ దానును గోరంగి వెడలె. వలవలనిమంచుఁ దుప్పరముసురుజడిం దడిసి జడనుపడి వ్రేఁకలగుపోఁక పూఁబాళలపరిమళంబులఁ బుక్కిలించి యుమియుచుఁ, బక్కణంబులలోన నల్లనల్లన పొలుపారు నడవికరువలి యసమసమవిషమకుసుమఫలక్రీడామతల్లికల మల్లుపెనంగి డస్సిన భిల్లపల్లవాధరల గల్లఫలకంబులఁ గ్రొత్తయుదయించు చెమటచిత్తడి యుడిపె. కాశి శ్రీశైల కుంభఘోణశోణార్క కాంచీ కాంచనసభా కాళహస్తి కురుక్షేత్రాదిపుణ్యస్థానంబులం గూపవాపీతటాకకుండికా ప్రస్రవణస్రోతస్వినులం బ్రత్యూషకాలంబులం బరమర్షిసార్థంబు తీర్థంబాడె నివ్విధంబున మాఘమాసవాసరంబులు వసంతసమయసామంతంబులు జరగుచుండ నాచండాలాదిమనుష్యులకు భుక్తిముక్తులు ప్రసాదింపంజాలి మాహేశ్వరులకు మహోత్సవంబు పాటు

పతులకుం బ్రీతి కాళాముఖుల కవలంబంబు మునులకు
౧ మనికి జటాధారుల కాధారంబు పరివ్రాట్టులకుఁ బట్టుఁ
గొమ్మ వేదాంతులకు సంతోషం బాగమికులకు భాగ
ధేయంబు మాంత్రికులకు మనువు తాంత్రికులకుఁ దా
వలంబు పౌరాణికులకుఁ బ్రాణం బావనివదుల కుపా
యంబు ముముక్షువులకు రక్ష శంభునకు విస్రంభస్థానం
బు శాంభవికి హృదయోత్కంఠయు హేరంబునకుం
బ్రియంబు తండువునకుఁ బందువు కుమారస్వామికిం
బ్రేమాస్పదంబు భృంగిరిటికిం దంగటిజున్ను దురితతరు
షండఖండనంబునకు గండగొడ్డలి యఘపటలతిమిరస
ముదాయాహిమఘృణిసంతానంబు సంతాపశాంతికి
భాగీరథీప్రవాహంబు శివరాత్రిపుణ్యకాలంబె తెంచిన.

సీ. ఆవణిక్షథమున కనతిదూరంబున
గవ్యూతియెడ నుదక్పశ్చిమమునఁ
బర్వతో పత్యకాపర్యంతతటమున
సికతాతిని ర్గలక్షేత్రసీమ
మాలూరతరుషండమధ్యభాగంబునం
బ్రస్రవణాపగాపార్శ్వభూమిఁ
గుసుమవాటికలలోఁ గువలయాంభోరుహ
కుముదమండితమైన కొలనితోడఁ
గోటతోఁ గోపురములతోఁ గుట్టిమాట్ట
మండపంబులతో మహామహిమనొప్పు

నాదిమధ్యంబు నాగేశ మనఁగ నొక్క
పుణ్యతీర్థంబు త్రైలోక్యపూజితంబు 3౧

గీ. అందు శేషప్రతిష్ఠితుం డమృతదివ్య
లింగమంగళమూర్తి ఖట్వాంగపాణి
యర్ధశశిమౌళి నాగేశ్వరాహ్వయుండు
ప్రతివసించు ననేకకల్పములనుండి. 3౨

వ. ఆశివరాత్రిపుణ్యకాలంబున. 33

సీ. శివగంగఁ బుణ్యాభిషేకంబు దీర్చిరి
దరి నొనర్చిరి మూఁడుతర్పణములు
ధరియించి రంబునిర్ధౌతవస్త్రంబులు
నాచరించిరి బ్రహ్మయజ్ఞతంత్ర
మర్ఘ్యాంజలిక్షేపణానంతరమ్మునం
దొనరించి రంశుమంతున కుపాస్తి
గృహదేవతార్చనక్రియ లాచరించిరి
యభ్యాగతులకు నన్నాలు నడిపి
రవనిసురులెల్ల నాగేశ్వరాలయమున
కేగుదెంచిరి ప్రణమిల్లి రీశ్వరునకు
- - - - - - - - - నాల్గుజాలుఁ బూజ
నాదిసంకల్ప మొనరించి రభవుమ్రోల. 3౪

గీ. ఆదరంబున సమ్మార్జనానులేప
ధూపపటువాసనలు తైలదీపములును

సంఘటించిరి వివిధసంస్కారవిధుల
బ్రాహ్మణులు సర్వజ్ఞులైనట్టి పౌరజనులు. ౩౫
సీ. కాంస్యతోరణమాలికలు సంఘటించిరి
ప్రాసాదగోపురాభ్యంతరముల
రంభాతరుస్తంభసంభారములు సము
త్పాటించి రొగిఁ బ్రతిద్వారమునను
బూజోపకరణపాత్రీజాత మఖిలంబు
సంస్కరించిరి భస్మసలిలశుద్ధిఁ
గరమొప్పు వృషభపుంగవ కేతనంబులు
నిలువంగఁ బెట్టిరి నలుభులందుఁ
గమలనీలోత్పలంబులుఁ గర్ణికార
మాలతీకుందములు హేమమరువకములు
మల్లికాకింశుకము లపామార్గవకుళ
పాటలంబులుఁ గూర్చి రపారములుగ. ౩౬
గీ. అపుడు సుకుమారకాహ్వయుం డదరునజ్జ
నేగుదెంచెను నాగేశ్వరేశుగుడికిఁ
బుష్పవాటికలోఁ గమ్మపువులఁ గోసి
పొలఁతులకు నిద్దఱకుఁ గొంచుఁబోవఁదలఁచి. ౩౭
క. కుడిచేత మాంసఖండము
లెడకేలను మద్యరససహితమగు కంచుం
గుడుకయు ధరించి మదమున
వడవణఁకులు గొనుచు నతఁడు వచ్చె న్గుడికిన్. ౩౮

వ. జన్మాంతరస్థుండువోలె రూపాంతరగతుండువోలె నావిష్టుండువోలె భూతాధిష్ఠితుండువోలె గ్రహాగృహీతుండువోలె నున్మత్తుండునుంబోలె మదిరామదాతిరేకంబునఁ దన్నుఁ దా నెఱుంగక పరిసరలతాకంటకాను షజ్యమానాంశుకోత్తరీయుండును నజ్ఞాతసమవిషమ మేదినీభాగవిన్యాసప్రస్ఖలితపాదద్వయుండును నై పలిత పాండురంబు లగుశిరోరుహంబులు విరిసి వీఁపునం బడ నొయ్యనొయ్యన నేతెంచి నిర్లజ్జుండును నిస్స్నేహుండు నృశంసుండును నగునక్క్రూరచండాలుండు గర్భగేహంబునకుఁ జక్కంగ నెదుర నిలిచి రక్తకమల దళచ్ఛాయంబు లగుకన్నులు దెఱచి విఘూర్ణమాన తారకంబైన వికారాలోకనంబున నవలోకయుంబోలె నిర్మలస్ఫటికమండపాభ్యాసీనుండును నమృత మయజ్యోతిర్లింగమూర్తియు ముక్తాఫలధవలకాంతి యుఁ ద్రిభువనవందితచరణుండును జరాచరగురుండును నగు నాగేశ్వరుని దర్శించి యమ్మహాదేవు మౌళికపాలమాలికామండనఖండేందు శకలంబులకు గగనగంగాప్రవాహడిండీరఖండంబులకు నుష్ణీషఫణిఫణా ఫలకంబులకుఁ జెలికారంబు సేయుచుంజాలి పాంచజన్య సహోదరంబు లన దుగ్ధాంబురాశిహృదయంబు లనఁ జంద్రికాకిరణంబు లన నంగజాట్టహాసంబు భేదంబు లన మెండుకొని యున్న పుండరీకంబుల పూజ గనుంగొని వెండియు. ౩౯

ఉ. చాయన భోగిరాట్కటకసన్నిధి దీపితదీపమాలికా
చ్ఛాయఁ బురఃప్రదేశమునఁ జాఁగిన నిర్ఝరవాహినీము
హా, తోయముసావి చీరయెగఁద్రోచి చొరంగఁ దలం
చె నెంతలోఁ,తో యని కొంకి కొంకి పతితుం డతఁ
డానవపానవిక్రియన్. ౪౦

గీ. పవనవశమునఁ గేతకీప్రసవధూళి
యంగమున హత్తియుండంగ నాతఁ డవ్వు
విమలభస్మసముద్ధూళన మొనరించి
పాశుపతదీక్షఁ గైకొన్నభంగి నుండె. ౪౧

చ. కలఁగఁగఁబాఱె నాతని యఘంబులు పంచహృషీక
సంభవం, బులు బహుకాలసంకలితము ల్దవవహ్ని చిట
చ్చిటధ్వనిం, గలఁగఁగఁ బాఱు పక్షులవ్రకారమునం
దోలుజాముపూజకై, బలుపటహమ్ము లమ్మనుచు భర్గుని
గేహమునందు మ్రోసినన్. ౪౨

వ. శివరాత్రిపుణ్యకాలంబునఁ బురాణంబులు వినిపిం
చువారును నితిహాసంబులు చదువువారును బంచాక్షరీ
పంచబ్రహ్మాదిమంత్రంబులు జపించువారును నీలకంఠ
స్తోత్రంబులు పఠించువారును బ్రాణాయామంబు లను
సంధించువారును బ్రత్యాహారంబులు నడుపువారును
బ్రదక్షిణంబులు సేయువారును భస్మోద్ధూళనంబు
లొనర్చువారును దురోదరంబుల వినోదించువారును
నష్టావధానంబులఁ గ్రీడించువారును వీణ లాస్ఫాలించు

వారును గావ్యగోష్ఠి సలుపువారును బరిహాసం బాద
రించువారును బిందుమతి యభ్యసించువారును బ్రహే
ళికలు భావించువారును నాడువారును బాడువారును
మేషకుక్కుటకరేటులావుకకపింజలయుద్ధంబులు వీక్షిం
చువారును గుబ్జవామనకిరాతబర్బరజరఠమూకజనవికా
రంబు లవలోకించు వారు నై జాగరంబులు సలుపు
చునుండిరి సుకుమారుండును నొక్కించుక యున్నం
దేటకొని వారిం జూచుచుండె నప్పుడు శివగంగానిర్ఝర
జలతరంగశీకరజాలజనితజడిమంబులు నందిరోమంథ
ఫేనబిందువాహులుం గుమారశిఖికలాప విధూనన క్రి
యా లలితంబులుఁ బశుపతిజటాబద్ధవాసుకినిపీతశేషం
బులు హేరంబగండమండల నిష్యందమాన దానధా
రాకల్మషగంధలహరీ పాణింధమంబులు భృంగిరిటి ని
కుంభకుంభోదర ప్రముఖనిఖిలగణపరిష దుద్ధూళితభసి
త ధూళికావిసరంబులు మాతృకాశ్రవణావతంసకహ్లా
రకోరక ప్రేంఖోళన ప్రక్రియాసమభిహారానుమేయావ
తరణంబులు మహిసాక్షి గుగ్గులుధూపధూమకంబులు
మాలూరకిసలయామోద మేదురంబులు నగు మహా
దేవనిశామారుతంబు లతనిమీఁదఁ బొలుపారి పాత
కంబులు దూలరాల్చె నట్టిసమయంబున. ౮౩

౯. అర్ధరాత్రంబుదాఁక నయ్యధమవృత్తి
శివునిశావైభవంబు వీక్షించి చనియెఁ

దానకమునకు నది యాదిగా నతండు
విడిచెఁ దొల్లింటి నీచప్రవృత్తిబుద్ధి. ౪౪

వ. అంతఁ గొంతకాలంబునకు.

క. కుక్కలలో శబరులలోఁ
గక్కర చిమ్మటలలోనఁ గారోకులలోఁ
బక్కణముగుడిసె నడుమను
గుక్కపయిం జచ్చె నతఁడు ఘోరవ్యాధిన్. ౪౫

క. శ్రీనాగేశ్వరశంభు
స్థానంబున గిరిశురాత్రి జాగరములు - - -
- - - ననుగనుఁగొన్నట్టిక
తానను విగతాఘుఁడై యతఁడు మృతిఁ బొందెన్.

సీ. క్రిమి కంఠకుహరమార్గమున కడ్డము దొట్టి
పెద్దయేనియు బాధ పెట్టకుండ
శ్లేష్మ ముద్రేకించి సెలవి రంధ్రమువాయు
మెఱసి నుచ్చిళ్లు గ్రమ్మింపకుండ
దృగ్గోళకంబులు దిరుగంగ దృష్టియు
నంధకారంబులో నణఁగకుండ
నెఱిదప్పి యుచ్ఛ్వాసనిశ్వాసపవమాన
పరివాహగతు లోటువడక యుండఁ
బరమయోగీశ్వరుఁడువోలె బ్రహ్మరంధ్ర
వీథిఁ బ్రాణంబువిడిచె నవ్విప్రకులుఁడు
పుణ్యశివరాత్రినలవోకవోలెనైన
నురగధరుచెంత జాగరం బుండెఁగాన. ౪౬

వ. ఆకాలంబునఁ గాలకింకరులు మృత్యుదేవతాసహితు
లై ముసల ముద్గర తోమరాది ప్రహరణంబులతో
- - - అతనిలింగశరీరంబు వరుణపాశంబుల బంధిం
చి కొని పోవఁ గణంగిన నవ్వేళ శివదూతలు శివాజ్ఞావ
శంబున శూలాంకుశ గదా భిందిపాల పరిఘపరశ్వధ
- - - - - - - - - -చ్చి దవ్వుల నాకాశమార్గంబున.

గీ. ఓరి యమునిదూతలార యీబ్రాహ్మణుఁ
గరుణ మాలి యేల కట్టినారు
విడుఁడు శివునియాన మృడునాజ్ఞ దాఁట మీ
రాజు - - - - - - గ్గరాముదించి. ౫౦

మాలిని. విడుఁడు విడుఁడు వీనిన్ (విప్రునిన్) భాగ్యవంతున్
మృడుఁడు కరుణతోడ న్నిక్కిలిం గారవించెన్
జడుల కొరుల కేలా సంభవించున్ యథార్థం
బడర మతిమ్మ - - - - - - - ప్పాలవంబుల్.

గీ. అన్నదాన తపస్స్నానృతాదులైన
పుణ్యకర్మం బొనర్చిన పురుషునందు
నెట్లు సంతోషమందు నర్ధేందుమౌళి
యట్టిసంతోష. మితనియం దావహించె. ౫౨

వ. అనిన యమకింకరులు శంకరకింకరుల కిట్లనిరి. ౫౩

సీ. ఏకార్యమునకయి యెచ్చోటి కరిగెద
రరుగుఁడు మీరు మహాత్ములార

యితని క్లేశము చూచి యతికృపాపరతమై
పు - - - - - - - రింపఁ బూనినారె
హరుకింకరుల మన్న నాశ్చర్య మయ్యెడు
సదసద్వివేకంబు చాలకునికి
భవభక్తులకు నడ్డపడుట ధర్మము మీకు
నేమేల పట్టుదు మీశుభక్తి
నితఁడు కలుద్రాగి ఱంకాడె నెఱచిఁ దినియె
నిలిచి మూత్రించెఁ జండాలలలనఁ గూడెఁ
గూఁతు రమియించెఁ దెగువాటుగొట్టెఁ బ్రజలఁ
జెంచురాజుల సేవించెఁ జెఱిచెఁ గులము. ౫౪

సీ. కేలుదో యెత్తి మ్రొక్కెనె పాశుపతులకు
శరణార్థి ననియెనే జంగములకు
ఫాలభాగమునందు భస్మంబు పూసెనే
యఱుతఁ దాలిచెనె రుద్రాక్షపూస
శివమంత్ర ముచ్చరించెనె జిహ్వ నెప్డు
నరిగెనె యెన్నఁడే నభవుగుడికిఁ
బఠియించెనే మహాప్రమథచారిత్రంబు
తిరిగెనే మృదుపుణ్యతీర్థములకు
దానములు పెక్కుఁ జేసినదానఁ గాని
కాలగళుభక్తియావంతఁ గలిగెనేని
యడ్డపడ ధర్మమౌఁగాక యనఘులార
యర్థమే యీదురాత్మున కడ్డపడఁగ. ౫౫

ఉ. ఎట్టుగ నేగుదెంచితిరి యిందుకళాధరభృత్యులార యీ
చెట్ట దురాత్మునిన్ హరుని చెంతకునుం గొనిపోవువారలై
మెట్టొకొ శంకరుం డొకని నెవ్వనినేఁ గొని తేరఁ బం
పినం, బట్టఁగ వచ్చినారొ తడఁబాటున వీని మహోభ్ర
మంబునన్. ౧౬

సీ. అని హేతువులును దృష్టాంతంబులును జూపి
యమ - - - - - - యువనిసురుని
నూరక యుండెడి మృత్యువు నోర్గదల్పక
భవునిచే మును పడ్డపాటుఁ దలఁచి
వరుణపాశములచే వ్యథితచేతస్కుఁడై
సుకుమారుఁ డింతేని స్రుక్కు చుండ
నెదురుచూడఁ దొణంగి రీశ - - - - - - -
తారు పంచినవారు తడయుటయును
గాలయాపనమునకు నిగ్రహముఁ బూని
శంభుకింకరు లఘుడవష్టంభ మెసఁగ
నాడుగఱచుచు నప్పు డేకాంతముండి
సమధికం బైన సాహసోత్సాహవృత్తి. ౧౭

ఉ. బిత్తరి దండిమాట లిటు ప్రేలెదరే యమరాజసేవకుల్
చిత్తజవైరియాజ్ఞ గొఱకచీరికిఁ గైకొన కంచు నుద్ధతి
న్నిత్తిని వారినిం గదిసి నిర్భరభూరిభుజాబలంబునన్
మొత్తిరి యుర్కి బాహువులు మోడిచి పట్టి వృషాంక
కింకరుల్. ౧౮

క. కడవసములఁ బ్రహరించిరి
యడిచిరి లాతముల మొత్తి రహివలయములం
బిడికిళ్లను ఘట్టించిరి
తడఁబడ మృడుభటులు దండధరుకింకరులన్. ౫౯

వ. ఇట్లు మొత్తువడి యమకింకరులు శంకరకింకరులకుం బ్రతిఘటింపక సుకుమారుని బరివేష్టించి యమలోకంబున కభిముఖులై యతనిం గొనిపోవం దొణంగి రప్పుడు రుద్రాక్షమాలికావక్షఃస్థలుండును జంద్రార్ధకృత శేఖరుండును భస్మోద్ధూళితఫాలితాంగుండును ద్రిలోచనుండును నతిప్రమాణకాయుండును నగునీలలోహిత ప్రమథుండు కాలాంబుదధ్వానగంభీరం బైనకంఠస్వరంబున నిట్లనియె. ౬౦

సీ. పడసె నెవ్వనికృప బ్రహ్మ బ్రహ్మత్వంబు
విష్ణుండు విష్ణుత్వవిభవమంబు
నీరేడుజగములు నెవ్వనికుక్షిలో
నొక్కఁ డొక్కంటితో నొరయుచుండు
నంధకేభజలంధరాదిదానవకోటిఁ
గ్రాఁగించె నెవ్వానికంటిమంట
యామ్నాయశాఖాసహస్రంబు లెవ్వని
నాసికారంధ్రనిశ్వాసధార
లమ్మహాదేవు లెంకల మైనమేము
భర్తయానతి నిర్వహింపంగఁ దలఁప

మమ్ముఁ జేరికిఁ గైకోక మదముప్రేరి
నెట్టుకొనిపోయెదరు విప్రు నెఱయఁగట్టి. ౬౧

ఉ. బుద్ధియు కల్గెనేని కొనిపోకుఁడు ధర్మము సూక్ష్మ మీరు య
సం, బద్ధము లైనన్యాయములఁ బంతము వచ్చునె మే
ము దెంపుమై, యుద్ధము సేయఁజాలకయు యోహరి
సాహరి నెంతచెప్పిన, న్నిద్ధరణీతలామరుని నీరు చలం
బున మీకుఁ దక్కునే. ౬౨

గీ. ఎంత చెప్పిన విన రేమి యీకు మాకు
హరునియాజ్ఞయు బలవంత మల్ల మెట్టు
చాక నొవ్వక మీరు మాకాఁకఁజెడక
యిద్ధరామరు మా కిప్పు డిచ్చు టొప్పు. ౬౩

క. నావుడును యమునిదూతలు
భావభవారాతిప్రమథవర్గముతోడన్
సేవకధర్మము తగవును
లావును బంతంబు దృఢబలంబును మెఱయన్. ౬౪

వ. ఇట్లని పలికిరి. ౬౫

క. చత్తుము చెఱఁబడుదుము కడు
నొత్తుము మీచేత నెట్టునుం దగవు మముం
బుత్తెంచినపతిసన్నిధి
నుత్తరమెట్లిత్తు మాజ్ఞ యుపహతిఁబొందన్. ౬౬

సీ. చర్చించిచూడుఁడా చంద్రార్ధహాళికి
యమరాజు నిజభృత్యుఁడౌనొ కాఁడొ

యభవుఁ డిచ్చినయట్టి యధికార మాఁగాదొ
యముఁడుగూర్చున్న ధర్మాసనంబు
త్రిపురాసురాంతకుదివ్యదేహము గాదొ
వేదస్మృతులు తత్త్వవిధిఁ దలంప
శిష్టరక్షయు దుష్టశిక్షయుశూలికి
- - - దొ .యూత్మలోన
నవకరము లెన్ని యన్నియు నాచరించెఁ
బాపి యగువీని నరకకూపమునఁ ద్రోచి
బాధపెట్టంగవలసినపట్టునందుఁ
బంతమే విడుఁ డంట యో ప్రమథులార. ౬౭

ఉ. చచ్చిన నేమి మూర్ఛ - - - నేమి ప్రహారవేదనన్
నొచ్చిననేమిపండ్లుచెవినోరు కరాంగుళనేత్రగోళముల్
ముచ్చిన నేమి పట్టపతిమొక్కలిబంధనశాలలోనికి
న్వచ్చిన నేమి భృత్యునకు నచ్చినయేలికయాజ్ఞపట్టునన్

సీ. తగవు ధర్మంబుఁ పాడి పంతంబు దెలిసి
యనుపుఁ డీబ్రాహ్మణుని బాధ లనుభవింప
నొండె దురమున మమ్ము మృత్యువు జయించి
విప్రుఁ గొనిపొండు మాటలు వేయునేల. ౬౯

క. మీకును మీపతియానతి
మాకును మాభర్తయాజ్ఞ మన్నింపఁదగుఁ
వాకొవాక్యములు* వెడ
వాకొట్లం బట్టుజంబు వలవదు సేయన్. ౭౦

* వాకొవవాక్యముల, అని మూలము.

క. అని యముని భటులు పలికిన
విని శంకరభటులు తద్వివేకంబునకున్
మనమున సంతోషించియు
మనసిజహరుశాసనమును మన్నించుటకై. ౨౧

సీ. పొడికచ్ఛడముల పైఁ బులితోలునునుసేలు
కటిభారమునఁ గాసెకట్టు గట్టి
యభినవంబైన రుద్రాక్షయొడ్డాణంబు
నాభిచక్రములోనుగా భరించి
ప్రిదిలి జాఱక యుండఁ బెనుఁబాఁపపోఁగులు
శ్రవణభాగమునందు సంతరించి
యల్లిబిల్లిగ జటావల్లిమతల్లులు
గూర్చి పెంపొందఁ గీల్కొప్పు వెట్టి
భసితధూళి శరీర మభ్యంగమార్చి
యుద్ధవిడిఁ బారిషదయోధు లొక్కఁడొక్కఁడ
యాయుధంబులు ధరియించి యట్టహాస
డమరుకధ్వానసింహనాదములతోడ. ౨౨

శా. ఆటోపారభటీసముద్భటతరాహంకారబాహాధను,
ర్జ్యాటంకారరవంబులంబుజభవాండాభ్యంతరంబుల్ స
మా, స్ఫోటింపంగ లలాటలోచనభుజిష్ణ్యుల్ దండభృ
ద్భృత్యులన్, ఘాటీసంభ్రమలీలఁ దాఁకిరి వడిన్ ధా
రాధరాధ్వంబునన్. ౨౩

సీ. ద్రాఘిష్ఠకఠినదంష్ట్రాదండసంఘట్ట
కటుఘోరకిటకిటాత్కార మగుచుఁ
జటులఝుంఝూమరుజ్ఝంపాపరంపరా
సన్నిభఘ్రాణనిశ్వాస మగుచు
వికలతారకచక్రవిభ్రాన్తిభీషణ
స్ఫారచక్షుర్ద్వయీభయద మగుచు
నిటలవీథివిటంకనిర్భరభ్రూకుటీ
నటనక్రియాటోపపటిమ మగుచుఁ
గాలమృత్యువు శాణచక్రమునఁబట్టి
చికిలిచేసిన యడిదంబుఁ జేతఁ దాల్చి
జేగుఱించిన మొగముతోఁ జిత్తజారి
ప్రమథవర్గంబుఁదాఁకె నాగ్రహమెలర్ప. ౭౮

వ. - -రవణిత మరువుర మర మనినద ముర వణించుచుఁ దచ్చటులతమామీర డంబర విష్కంభము కాష్ఠాకటాహముల నుద్ఘాటింప దినకరకరచ్ఛాయాచ్ఛేదాధిగమమున ధగద్ధగితము లగునిస్త్రింశకుంతారాద్యాయుధ దీప్తులు గణలక్ష్మి నివాళింపంగ నపుడు విద్యాధర పన్నగ యక్ష గరుడ గంధర్వాదులు మది నాహ్లాదింపంగ సురముని కుంచె యాడింపంగ నిలింపా - - - పథంబున భవుని లెంకలు శమనకింకరులును బాహావష్టంభవిజృంభణమవ్రతిహతముగ నొండొరువులఁ దాఁకిన భండనంబు ఘోరం బయ్యెను. ౭౯

క. శంకరభటులును నంతక
కింకరులు మిథఃప్రహారకీలాలసటా
పంకిలతను లయి కుసుమిత
కంకేలీతరులభంగిఁ గనుపట్టి రనిన్. ౭౬

వ. అప్పుడు కింకరులయం దొక్కరుండు యమునిసన్నిధికిం జని యతని కిట్లనియె. ౭౭

సీ. దేవ దేవరయాజ్ఞ ధృతి నేము దలఁచూని
మృత్యువుఁ గూడి భూమీస్థలమునఁ
జని వణిక్పథ మనుఘనపట్టనమునకు
ననతిదూరమున శైలాంతరమున
నడవిలో నొకమృగవ్యాధపక్కణమునఁ
గుష్ఠామయంబునఁ గుతిలపడఁగఁ
జెడిపెకూఁతురు కాళ్లకడనుండి యేడ్వంగఁ
బంచత్వ మొందినపాపకర్ము
బ్రహ్మబంధుని సుకుమారుఁ బట్టి తేఁగ
నభవుదూతలు రానీక యాఁగినారు
మాకు వారికి దుర మయ్యె నాకసమున
నెఱుఁగఁ జెప్పంగ వచ్చితి నిత్తెఱంగు. ౭౮

వ. అనిన విని కృతాంతుండు సమధికక్రోధావేశవివశస్వాంతుండై యుదుంబరుం డను సేనాని రావించి యతనితో నిట్లనియె. ౭౯

గీ. చను ముదుంబర వృషభలాంఛనుని లెంక
లాఁగినారంట మనవాండ్ర నాకసమున

నోళ్ళ పాపాత్ముఁ గొని తాఁగ నుద్ధవిడిని
నేగి యాజటాధారుల నెగిచి రమ్ము. ౮౦

క. గబ్బున నెదిరించిన నోళ
దెబ్బగొనుచు - - - నెదురె త్రిజగముల నోరుల్
తబ్బిబ్బుగ జంగములకుఁ
బబ్బంబులు వెట్టు ముష్టిపరిఘట్టనలన్. ౮౧

గీ. వ్యాధు లష్టోత్తరశతంబు వచ్చుఁగాక
తోడ నేతెంచుఁగాక మృత్యువులు నూఱు
పంపినారము మున్నాడి భటులఁగూర్చి
కాలమృత్యువు గెల్చు శంకరునిహితుల. ౮౨

వ. అని పల్కిన వల్లె యని యులుంబరుండు వివిధ వ్యాధి మృత్యు పరివృతుండై కదలి యుద్ధవిడిఁ దూర్యంబులు మొరయఁ బ్రమథానీకంబుఁ దాకి శస్త్రజాలంబు నిగిడ్చి పేర్చి యార్చినం గోపించి పంచవదనుభటులు కుటిల భ్రూభంగభీషణంబు లగు మొగంబులు జేవురింప నట్టహాసంబు చేసి యుదల్చి డమరుడిండిమా రవరమధ్వానంబులోఁ గీనాశకింకరుల ముసలభిందిపాలతోమర మండలాగ్ర త్రిశూలపట్టసంబులఁ బ్రహరించిన విచ్ఛిన్నబాహూరుచరణవక్షః - - - - లలాటకృకాటులై విచ్చియు నొచ్చియుఁ జచ్చియుఁ దెరలియుఁ బొరలియుఁ దొగియుఁ దాఁగియుఁ గ్రుస్సియు డస్సియుఁ గందియుఁ గుందియు దారియు-

మ్రొగ్గియుఁ డగ్గియు నలసియు సొలసియు వికావికలై
దిక్కాముగంబులై యూరుసారులై గురియై బందబందై
భండనంబు విడిచి వలయు . . బారి వెలవెలంబోయి
కృతాంతునిసన్నిధికిం బోయిరి. ఇట జటాధారులు
సుకుమారుని బంధనంబు లూడ్చియు నతని మున్నిడు
కొని హరాన్నాళంపుఁగరాచూరి చాయలం బంటించు
మింటి తెరువునం జనిరి. అప్పు డాసుకుమారుండు పుణ్య
శివరాత్రి వ్రతాలోకనప్రభావంబున. ౮౩

తాళవృత్తము. (?) దాదవులం గాంచెం గైలాసము తరు
ణేందు(కళా)ధరునినివాసము, దశహరిస్థానస్థపుటితధవ
ళచ్ఛాయాచ్ఛేదవిలాసము, ధ్రువమండల - - నంతాధి
ష్ఠాలశృంగశృంగాటకవిహార, ఖచరగరుడగంధర్వప్రమ
దాస్తోమవిహితలీలాపరిహాసము, నవలేపాటోపసముద్భ
టవిఘ్నాధిప దీర్ఘవిషాణప్రఘణవ్యాఘట్టనపారద . . .
మయప్రస్థతటధ్వనివిసరము, నవిహితయాతూముద్రా
నిగదవ్యాఖ్యాతాశోకలతాపల్లవ యాథాతవ్యయువిజి
త్వసీహారాద్రిసుతాచరణన్యాసము.

సీ. కామధుగ్ధేనుసం . . . . తోట్టులుగాంచెఁ(?)
గాంచనననరత్నకందరములు
కాంచెఁ గల్పకవాటికానహస్రంబులు
సిద్ధరసాపగాశ్రేణిఁ గాంచె

బహుహిరణ్మయమహాప్రాకారములు గాంచె
నమరిన . . . . ధములుగాంచెఁ
ప్రబలచింతామణీస్పర్శవేధులగాంచె
నానావిమానరత్నములు గాంచె
హావభావవిలాసరేఖావిశేష
హారిమూర్తుల రుద్రకన్యకలఁ గాంచె
(మనసు త)నివోవ నర్ధేందుమౌళిఁ గాంచెఁ
గాంచె సుకుమారుఁ డంబికాకాంతు శివుని. ౮౫

వ. కాంచి దండప్రణామంబులు చేసి చేతులు మోడ్చి నమశ్శంకరాయ, శశాంకమూర్ధాలంకారాయ, త్రిభువన (?) పురంధ్రీసీరంధ్రస్తనకుంభసముత్తంభితకస్తూరికాస్థాసకముద్రాద్రోహిబాహార్గళస్తంభాయ, జంభారిప్రముఖనిఖిలదేవతాకోటి హాటకకిరీటకోటీవిటంకసంవాసితమందారమాలికా మరందబిందునిష్యందధారాధౌతచరణారవిందాయ, జలంధరాసురకంధరా పీఠికావిఘట్టన క్రియాగరిష్ఠనిష్ఠురతాశశ్వద్విభంగఖట్వాంగపాణయే, పశ్యల్లలాటాయ, మదనమదగదాగదంకారాయ, సంధ్యానటాయ, కరకలితడమరుతాంకారబృంహితబ్రహ్మాండమండలాయ, చండికాధిపతయే, నిరస్తసమస్తోపాధికాయ, సచ్చిదానందస్వరూపాయ, స్వమహామహిమప్రతిష్ఠాయ, నిరుపాధికనిరవధికనిర్నిరోధనిరవగ్రహానిరభిసంధినిర్భరకృపాసంపత్సంపూర్ణమేధ

నే, వృషాంకమాలికాభరణాయ, సముద్దండపుండరీక క్రవ్యాదకృత్తికంథాధురంధరస్కంధభాగాయ, భగవతే ధన్యోఽస్మి! కృతపుణ్యోఽస్మి! నమస్తే నమస్తే అని పలికి వెండియు. ౮౭

విషమవృత్తము.

(?) జయజయశంకరజయజయపురహర
జయజయ . . . . . . గుణవరుణాలయ
జయజయతుహినసుతాధరకన్యాసహచర
జయజయశాక్వరవరశుభకేతన
జయజయమందరకందరకంధర
సంక్షుభితమహాక్షీరోదన్వజ్జఠరక్రూరశజలన
గిరీశా నకల్మాషి శితికంధరా! ౮౮

వ. అని యనేకప్రకారంబులం బ్రస్తుతించిన సుకుమారు మీఁదఁ గరుణాకటాక్షవీక్షణంబు లోలయించుచు విరూపాక్షుం డతనికిఁ గామగమనంబును హేమకింకిణీ మాలికాసనాథంబును రుద్రకన్యాసహస్రసంకులంబును నగుదివ్యవిమానంబొసంగి ప్రమథత్వంబు కృప చేసెఁ బుణ్యవంతుల భాగ్యంబునకుం గొలఁది గలదె యింక నెయ్యది (వినవలతు) రడుగుం డని సూతుండు నైమిశారణ్యనివాసు లగు మహామునులకు సవినయంబును సస్నేహంబును సగౌరవంబునుగా విన్నవించిన.

గీ. పరమమునులు సూత్యాహసంభవుని సూతు
భక్తిఁ బూజించి యధికతాత్పర్యగరిమ

భటులు ప్రమథులచే భంగపడుట చూచి
చిన్నవోయి యముం డేమిచేసెఁ బిడప. ౮౯

మ. కరుణాసాగర శైవశాస్త్రకలనాగాంభీర్యశౌర్యోన్నతా
తరుణీమన్మథ రాజపూజితకళాధర శ్రీయానంస్తుతా
వరనీతిప్రతిభావిశేషకలనావాగీశసంకాశ శ్రీ
తరుణీనాథమనోజ్ఞరూపవిలసత్కావ్యార్థసంబోధనా.

క. ధర్మార్థాలయవరగుణ
నిర్మాణవిశేషవిభవనిరుపమకార్యా
కర్మోత్కటబహుగుణవృత
నిర్మలసుజ్ఞానచతురనిశ్చలధైర్యా. ౯౧

మాలిని. శతధృతిధృతదీపా సారనిర్మాణరూపా
సతతసుఖవినోదా సామగానప్రమోదా
వితతకవివరేణ్యా వీరశైవాగ్రగణ్యా
యతులఫలవివేకా హార్షనైర్మల్యపాకా. ౯౨

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్యఁ
పుత్త్ర సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయప్రణీ
తైనశివరాత్రిమాహాత్మ్యంబునందుఁ జతుర్థాశ్వాస

---

శ్రీసుజనరంజనీ ముద్రాక్షరశాల, రాజమహేంద్ర